కార్చర్యపడి, విదేశమందు శ్రీవారు విద్య నభ్యసించిన విషయమును కనుగొని, కొంతసేపు మాటాడి వెంటనే యే యభ్యంతరమును జెప్పక సర్టిఫికేటు వ్రాసియిచ్చి నట్లును తెలియుచున్నది.

రాజకీయరంగమునుండి శ్రీ అరవిందులు విడీవడి పుదుచ్చేరిలో యోగాభ్యాస మొనర్చుచుండినను ప్రభుత్వమువారు మాత్రము వారిని విడిచిపెట్టినట్లు లేదు. ౧౯౦౯ జూలైమాసమున ప్రకటించిన 'నాదేశీయుల కొక బహిరంగలేఖ' యను వ్యాసమునందు రాజద్రోహమున్నదని, ప్రకటితమైన ఏన్మోమాసముల కావల, శ్రీ అరవిందులు పుదుచ్చేరి చేరిన కొంతకాలమునకు, రాజద్రోహ మొనర్చి పారిపోయిరను న్యూనత నారోపించునట్లు 'కర్మయోగి' ముద్రాపకునిపై దోషారోపణ మొనర్చి ఆతని బంధించిరి. ఆలేఖ ప్రకటించిన తరువాతను శ్రీ అరవిందుల సంపాదకత్వముననే 'కర్మయోగి' తొమ్మిదిమాసముల పర్యంతము తనసందేశమును వినిపించుచుండెను. అంతపర్యంతము ప్రభుత్వమువారా లేఖపై నేమియు చర్య తీసికొనలేదు. శ్రీఅరవిందులు పుదుచ్చేరి చేరిన తరువాతనే ప్రభుత్వమువా రభియోగము దెచ్చిరి. కాని క్రింది కోర్టులో ముద్రాపకుడు

శిక్షింపబడినను ఉన్నతన్యాయస్థానమున ఆ లేఖయం దేమియు రాజద్రోహము లేదని నిర్ణయించబడి ముద్రాపకుని విడుదలగావించిరి. ఇట్లు ఒకటి రెండు మూడు పర్యాయములు రాజద్రోహాది తీవ్రదోషములకు గురికావింపబడినను శ్రీ అరవిందులు నిర్దోషులని నిర్ధారణయగుట ఈశ్వరవిలాసముగాక మతేమి కాగలదు?

# శ్రీ అరవింద జీవితము



## ఐదవ తరంగము

శ్రీ అరవిందులు తన యోగసిద్ధికి దక్షిణదేశమును పుణ్యక్షేత్రముగ వరించుటయు నీశ్వర నిర్దేశముగా గనబడుచున్నది. అనాదినుండియు దక్షిణదేశము వేదాధ్యయనమునకు కీర్తి గాంచియున్నది. శ్రీఅరవిందులే యొకచో వెల్లడించినట్లు ఉత్తరదేశము రాజసిక తామసిక గుణములపాలై అంతఃకల్లోలములకు యుద్ధములకు నాకరమైనప్పుడు ఆధ్యాత్మిక జ్ఞానము దక్షిణదేశమునే యాశ్రయించెను. త్రిమతస్థాపనాచార్యులై ప్రపంచమునందంతటను నేటికిని పూజనీయులైన శ్రీ శంకర, రామానుజ, మధ్వాచార్యులకు జన్మస్థానము, తన్మూలమున పునీతము నగు దక్షిణదేశము నేడును శ్రీ అరవిందుల యోగసిద్ధికి నిలయమగుట మనభాగ్యము. మఱియు నేడు మనకు 'పుదుచ్చేరి' పట్టణ మెట్లగపడుచున్నను,

పూర్వమొకప్పుడు ఆధ్యాత్మికముగాగూడ మంచి పేరు మోసి పెక్కు సాధుపుంగవులకు, ముక్తపురుషులకు నిలయమై యుండినట్లు, శ్రీ సిద్ధానందస్వామి, శ్రీ అక్కాస్వాములను బ్రహ్మవేత్తలిద్ద ఱిచ్చటనే వెలసియుండినట్లు తెలియుచున్నది. వారి సమాధు లిప్పటికిని రెండు పరిసర గ్రామములందు గలవు. భక్తులెందఱో ఆ సమాధులను దర్శించి యారాధించి వచ్చుచుందురు. ఒక ద్రావిడ కవిశేఖరు డిట్లు వర్ణించియున్నాడు: "నీ వే పుణ్యక్షేత్రమునకేని యాత్ర చేసియుండవచ్చును; ఏ పవిత్ర తోయము లందేని స్నాన మొనర్చియుండవచ్చును; కాని మహాసిద్ధపురుషులకు నిలయమైన 'పుదుచ్చేరి' వంటి మహాక్షేత్రము మఱెచ్చటను లేదు. ఈ పట్టణము నీకు ముక్తినిచ్చును. పరబ్రహ్మజ్ఞానము నొసంగును. ఏలనన, ఎందఱో సిద్ధు లిచ్చటికి తరలివచ్చి శివగతిని మోక్షమును బడసిరి."

ప్రారంభమున దేశకాలపరిస్థితు లనుకూలింపగనే వంగదేశమునకు తిరిగివచ్చి యాధ్యాత్మిక దృష్టితో రాజకీయరంగమున బ్రవేశించు నుద్దేశ్యముండినను యోగసాధన మభివృద్ధి యగు కొలదియు మహోన్నతమైన యాధ్యాత్మిక పరిణామము యొక్క పరమార్థము వారికి

గోచరమై తమ సర్వశక్తుల నిటు నటు వెచ్చింపక ఏకాగ్రము చేసియుండుటయే యావశ్యకమని గ్రహించి, రాజకీయ సంబంధమును సంపూర్ణముగా త్యజించెను. అందువలననే దేశీయులు దేశీయ మహాసభాధ్యక్షునిగా వరించి యాహ్వానించినను 'మిత్రులు ప్రార్థించినను శ్రీ అరవిందు లంగీకరింపరైరి.

పుదుచ్చేరి చేరినతరువాత నాలుగు సంవత్సరము లేకాంతముగా తదేకధ్యానముతో యోగసాధన మొనరించి తమకు సాక్షాత్కారమైన దివ్యానుభవములను జిజ్ఞాసు లోకమునకు వెల్లడించుటకు ౧౯౧౪ వ సంవత్సరము ఆగస్టు ౧౫ తేది 'ఆర్య' యను తత్త్వజ్ఞాన విషయిక మాసపత్రిక నాంగ్లమున శ్రీ అరవిందులు ప్రకటింప నారంభించిరి. ఇట్లు భారతదేశమందు ప్రపంచ కల్యాణము భాగవతజీవనము నర్థించి తత్సిద్ధికై మహా ప్రయత్నము 'ఆర్య' పత్రికాముఖమున ప్రారంభింప సమకట్టిన సుముహూర్తమునందే పాశ్చాత్యులు కామ, క్రోధ, ద్వేష లోభాది దుర్గుణప్రేరితులై స్వార్థపరులై అర్థకాములై మానవత్వమునే గోల్పోయి లక్షలకొలది తోడి మానవుల ఘోర మరణములకు భయంకరసంక్షోభమునకు దారితీసిన మహాయుద్ధమునకు

సన్నద్ధులైరి. భౌతికశాస్త్రమునం దపారపాండిత్యమును సంపాదించి ప్రపంచఖ్యాతి గాంచిన జగదీశచంద్రుడు తన పరిశోధన శక్తిని సర్వము వినియోగించి 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అను నుపనిషత్ ప్రతిపాదిత సత్యాను సారముగా వృక్షములందును, శిలలయందును ప్రాణ మున్నదనియు, నవియు సుఖదుఃఖముల ననుభవించగల వనియు శాస్త్రీయముగా ఋజువుచేయుచుండిన సమయ మునవే పాశ్చాత్యభౌతిక శాస్త్రజ్ఞులు తమ ప్రావీణ్యము నంతను తోడిమానవుల క్షణములో హతమొనర్చుటకు వలయు విషవాయువులను మారణ యంత్రములను సృష్టించుటలో ధారబోయుచుండిరి. పూర్వపశ్చిమ దేశములయొక్క దృష్టిభేద మాహాత్మ్యమే యిది. సందర్భమున 'శ్రీ అరవిందవ్యాసావళి' అను గ్రంథము నుండి 'ప్రాచ్యపాశ్చాత్యములు' అను వ్యాసములోని కొంత భాగము నీక్రింద నుదాహరించుచున్నాము.

మన దేశమునకును యూరోపునకును ముఖ్యభేద మిది: మన జీవన మంతర్ముఖము, యూరోపుయొక్క జీవనము బహిర్ముఖము. మనము భావము నాశ్రయించి పాప పుణ్యముల విచారింతుము. యూరోపు కర్మ నాశ్రయించి పాపపుణ్యముల విచారించును. మనము భగవంతుని అంతర్యామిగా ఆత్మస్థితునిగా గ్రహించి

అంతరమునం దాతని వెదకుదుము: యూరోపు భగవంతుని జగత్ప్రభువుగా గ్రహించి వెలుపల నాతని వీక్షించి పూజించును. యూరోపుయొక్క స్వర్గము స్థూలజగమందు. పృథివియొక్క ఐశ్వర్యము, సౌందర్యము, భోగము, విలాసము ఇవన్నియు వారి కాదరణీయములు, అన్వేషణీయములు. వేఱొక స్వర్గమును వారు కల్పించినను ఈ నేలపైని ఐశ్వర్య సౌందర్యముల యొక్కయు భోగవిలాసముల యొక్కయు ప్రతికృతియే అది. వారల భగవంతుడు మన యింద్రునికి సాటి: లౌకిక ప్రభువు చందమున రత్నమయ సింహాసనముపై గూర్చుండి వేనవేల వందిమాగధుల కైవారములచే ఉప్పొంగుచు విశ్వసామ్రాజ్యమును పరిపాలించును. మన శివుడు పరమేశ్వరుడు; అయ్యును భిక్షుకుడు, ఉన్మాది, "భోలానాథుడు".* మన కృష్ణుడు బాలుడు, హాస్యప్రియుడు, విలాసి, ప్రేమమయుడు. క్రీడించుట ఆతని ధర్మము. యూరోపు యొక్క భగవంతుడు ఎప్పుడును నవ్వడు, క్రీడింపడు. అట్లు చేసినచో ఆతని గౌరవమునకు భంగము కలుగును, ఆతని ఈశ్వరత్వ మిక నిలువదు. పైజెప్పిన బహిర్ముఖభావమే దీనికి కారణము—ఐశ్వర్యమున కేవి చిహ్నములో అవియే వారల దృష్టియందు ఐశ్వర్యమున కాధారము. చిహ్నములు కనపడవేని వారు వస్తువును కనుగొనలేరు. వారలకు దివ్యచక్షువు లేదు, సూక్ష్మదృష్టి లేదు, సర్వమును స్థూలము. మన శివుడు భిక్షుకుఁడు; కాని త్రిలోకమందలి సకల ధనమును ఐశ్వర్యమును ఇంచుకలో సాధకునకు దానమిచ్చును.

---

* "మైమఱపుసామి"—అంతర్నివిష్టచైతన్యుఁడైన జడమూర్తి—స్థాణుడు. అనువాదకుడు.

అతడు "భోలానాథుడు;" కాని జ్ఞానులకు చేరరాని జ్ఞానము అతని సహజసంపత్తి. ప్రేమమయుడును, విలాసియును అగు మన శ్యామసుందరుడు కురుక్షేత్రమునకు నాయకుడు, జగమునకు పాలకుడు, బ్రహ్మాండమున కంతకును నెచ్చెలి, ప్రియుడు. భారత దేశముయొక్క మహాజ్ఞానము, తీక్ష్ణమైన సూక్ష్మదృష్టి, మఱియు అప్రతిహతమైన దివ్యచక్షువు స్థూలములైన ఆవరణములను భేదించు కొనిపోయి, ఆత్మయందలి భావమును, అసలైన సత్యమును, లో నిలిచిన గూఢతత్త్వమును బయల్పడజేయును.

*

* *

పాప పుణ్యముల సంబంధమునను ఈ చందమే గోచరించును. మన మంతరమందలి భావమును గమనింతుము. నిందపాలైన కర్మ యందు పవిత్రభావమును, వెలుపలకు పుణ్యరూపమున గాన్పించు కర్మయందు పాపిష్ఠమైన స్వార్థమును దాగియుండవచ్చును. పాప పుణ్యములును సుఖదుఃఖములును మనోధర్మములు. కర్మ ఆవరణము మాత్రము. సామాజిక నియతికొఱకై మనము బాహ్య పాప పుణ్యములను కర్మకు ప్రమాణముగా మన్నింతుము; కాని, 'అంత రంగమునందలి భావమునే ఆదరింపవలయును' అని మన మెఱుగు దుము. సన్యాసి ఎవ్వడాచార విచారములను, కర్తవ్య అకర్తవ్య ములను, పాప పుణ్యములను దాటి, "బాలోన్మత్త పిశాచముల" విధమున విహరించునో, సర్వధర్మత్యాగియగు నా పురుషుని శ్రేష్ఠుడని మన మందుము. ఈ తత్త్వమును గ్రహించుటకు పాశ్చాత్యబుద్ధి చాలదు. ఎవడు జడునివలె ప్రవర్తించునో అతడు

జడుడనియే తలపోయును. ఉన్మత్తుని విధమున ఎవడు ప్రవర్తించునో ఆతడు హేయభావాస్పదమైన అనాచారి పిశాచ మనియు గ్రహించును. ఏలనన సూక్ష్మదృష్టిలేదు. వారంతరంగమందలి భావమును చూడజాలరు.

'ఆర్య' పత్రిక నే సంకల్పముతో ప్రారంభించినదియు తెలియుటకు శ్రీఅరవిందులే 'మాయాదర్శము' అను శీర్షిక క్రింద బ్రకటించిన విషయముల నీ క్రింద సంగ్రహముగా బొందుపఱచుచున్నాము. దానివలన మానవాభ్యుదయమున కాశియాఖండము నైరోపాఖండము నే దృక్పథమున బ్రయత్నించినదియు దాని పరిణామ మెట్లు సంకరమై ఫలప్రదము గాకపోయినదియు ఆత్మానుభవమువలన సత్యదర్శనమువలన శ్రీఅరవిందులు గుహ్యతరమైన సమన్వయ మార్గము నెట్లు కనుగొని తదధికారియైనదియు, నే ధర్మసూత్రముల వలన లోక కల్యాణము భాగవతజీవన మేర్పడవలసియున్నదియు కొంత తెలియగలదు.

క్షణభంగురములును అనతిగూఢములు నగు తాత్కాలిక విషయ విమర్శనమేని ఇప్పటికి వాడుకలో నున్న మతశాఖాసిద్ధాం

తముల ప్రకటనమేని మా పత్రికను లక్ష్యముగా గైకొనలేదు. భవిష్యత్తును గూర్చి యాలోచించుటయు, దానిపునాది నిరూపణ యందు దోడ్పడుటయు, దానిని గతమునందలి శ్రేష్ఠతమము వీర్య వంతము నగు దానితో సంధాన మొనర్చుటయు దీని ముఖ్యోద్దేశములు.

మానవాభ్యుదయము నిరంతరమనియు మఱియు నయ్యది కొంతకాలము బహిర్గతమును మఱికొంతకాల మంతర్గతమునునై బాహ్యాబల ప్రయోజనముల వెనుకనుండి వర్తించు ప్రాణధురి యందలి యొకానొక భావవిశేషం బనియు మా నమ్మకము. ఇది లీనమై యంతర్గత మైనపుడే అతి గోప్యమగు రహస్యార్థము ను గుర్తించక ఆర్థిక రాజకీయ స్వార్థచింతనబలంబుచే తనయంశం బొందు, వెనుక గూఢముగనుండి, ప్రకటించునట్టి మానవకోటి యొక్క వక్రచలనములు, మందగతులు, దీర్ఘరాత్రులు, సంధ్యలు గల యుగము లగుచున్నది. అది బహిర్గత మగుకాలము మానవ కోటికి, తేజోవంతము శీఘ్రవికాసము నగువేకువలు, ఫలప్రదమగు వసంతకాలములు నగుచున్నవి. దానియొక్క గంభీరత, వీర్యము, సత్యము, బలము వీనింబట్టి దివ్యకాల మాసన్నమై పురోభివృద్ధి యాధారపడియుండును.

చింతన మనగా జీవనవికాసమందలి కుసుమము లేక జీవనా లంకారమగు నాభరణ మనియు, మానవుడు చేయు కర్మలను రాచ

కీయ ఆర్థిక స్వీయ లాభములే మూలాధారము లనియు నేటిలోక
తంత్రజ్ఞు డనుకొనుటకన్న గొప్ప పొరబాటు వేఱులేదు. ఈ
ప్రపంచము ప్రాణభరితము, కర్మభూయిష్ఠము, ప్రవర్ధమానమగు
జీవగుణయుతము నని మే మెఱుంగుదుము. కాని ప్రాణిక భౌతిక
బలములచే మాత్రము నియతమగు జీవయాత్ర ఆలస్యాంధకార
ప్రమాదదూషితమైన వృద్ధినే చెందును. మఱియు నయ్యది జంతు
వృక్షజాతితుల్యమగును. భూమి ప్రాణభౌతికమయమగు
ప్రపంచము. మానవుడు చెట్టును జంతువునుగాడు. అతడిచ్చట
దేహధారియై మహత్తరకర్మలకు ఉన్నతతర ప్రేరణలచే నా వృక్ష
జంతురూపమును దివ్యోపకరణముగ నొనర్చు నాధ్యాత్మిక
మానసిక పురుషునిగ నెఱుంగుము.

కావున నతడు తన బాహ్యజీవితమందు గుర్తించలేకున్నను
తన లోనున్న యొకసంకల్పవిశేషవ్యాపారము నే సదా సమకూర్చు
చుండును. గంభీరాభిప్రాయములని ధిక్కరించు వ్యవహారపురు
షుడుగూడ తా నేవగించు భావమునే తెలియకుండ సేవించు
చుండును. భావము బహిర్గతమై జీవయాత్రకు త్రోవజూపిననే
మానవుడు సంపూర్ణతను గాంచగల్గును.

దానంజేసి మానవాభ్యుదయము పర్యాయముగా తమః
ప్రకాశములతో గూడిన ద్వంద్వసంకులంబయిన నిరంతరవిప్లవ
రూపమైయున్నది. అట్లయ్యును ఈ యహర్నిశలు రెండును
వెల్లడిగా నున్నదానిని పోషించుచున్నవి. భూగోళమునం దన్ని
చోట్లను ఇవి యొకటే సమయమున తటస్థించుటలేదు. ఈ కల్పము
నందు మొత్తముపై నాశియా ఐరోపా ఖండములనే ఇటువంటి

యుద్యమ మంటియున్నది. ఆశియాఖండము మేల్కొన్నకాలము ఐరోపా నిద్రించుకాలమై యుండెను. అటులనే ఆశియా జడత్వముగాంచి సుషుప్తిజెందిన రాత్రులు ఐరోపా మేల్కొని మనోదీప్తిని ప్రాణవీర్యమును గాంచిన పగళ్ళగుచుండెను.

అయినను, ఇందొక ముఖ్యవ్యత్యాసముగలదు. కేవలముగ్గా గాకపోయినను ప్రబలముగా నాశియాఖండము మనుజునియొక్క అధ్యాత్మానుభవాభ్యుదయమునకు ముఖ్యక్షేత్ర మయ్యెను. ఐరోపా యన్ననో మనఃప్రాణ క్రియాకలాపమునకు కర్మాగార మయ్యెను. యుగములు జరుగుకొలది పూర్వఖండము, కొంతకాలము వేగ వంతమై నూత్నాభ్యుదయముల గాంచి మఱికొంతకాల మచంచల మగు నిలుకడం గాంచుచు నాధ్యాత్మిక శక్తికి నిలయం బగుచున్నది. ఈ శక్తివాహిని ఐరోపాపై నీ యుగమున మూడు నాల్గుపర్యాయములు ప్రవహించినది. ఒక్కొకసారియు నీ దివ్య ప్రేరణయొక్క ఆధ్యాత్మిక సారమును ఐరోపాఖండము సంపూర్ణ ముగనో పాక్షికముగనో త్యజించి దానిని మానసిక భౌతిక నూత్నా భ్యుదయములకు ప్రేరణోత్సాహముగ గైకొనినది.

మొదట ఈజిప్టియన్ చాల్డియన్ ఇండియన్ జ్ఞానము పితాగరస్సుమొదలు ప్లేటోనియన్ పిదప నవీన ప్లేటోనియన్లు లోనుగాగల గ్రీకుతత్త్వవేత్తల భావములద్వారా ప్రవేశించినది. ఇందుమూలమున మహత్తర ప్రతిభాపూరితమును, అనాధ్యాత్మిక మును అగు గ్రీకురోమన్ నాగరికత జననం బయినది. అయినను అది బౌద్ధమతము, వైష్ణవమతము, షెమిటీయుల భావమూలమున క్రీస్తుమతరూపమున రెండవపర్యాయ మైరోపాయందు ప్రవేశింప

నెడమిచ్చినది. క్రీస్తుమత మైరోపాతత్త్వమును జాలవఱకాధ్యాత్మికముగను విరాగపూరితముగను జేయనుండియు గొద్దిలో తప్పిపోయినది. మతగురువులగు గ్రీకుపాదరీల మనస్సునందలి తత్త్వజ్ఞానవికారమును, క్రైస్తవ సంప్రదాయమునకును గ్రీకురోమణమేధకును గుణములయందేమి లోపములందేమి ప్రత్యక్ష విరోధభావముగల జర్మానియా కూళల యాకస్మిక దాడియును దానిని దిగ్భ్రమజెందించినది.

స్పెయిన్‌లోనగు మధ్యధరాసముద్రతీరపు దక్షిణదేశములపై నొనర్చిన మహమ్మదీయ దండయాత్రయే మూడవపర్యాయము. భావములను శాంతముగ బ్రసరించుటయే నైజముగాగల ఆశియాఖండము తన స్వీయమార్గమునువదలి తద్విరుద్ధమైన ఐరోపావారి మార్గానుసారముగ భౌతికరాజకీయ విప్లవముల నుపయోగించినది. ఇందొక చిత్రముగలదు; ఆశియాఖండము తన వ్యుత్పన్నత నిట్లు ప్రయోగించినందుల కీ యుదాహరణ మొక్కటియే.

కడపటి అనగా నాల్గవప్రయత్న మింకను తిన్నని ప్రారంభదశయందున్నది. ఇందు ప్రాగ్దేశజ్ఞానము ముఖ్యముగ హిందూతత్త్వవిచారము, ప్రథమమున జర్మానియా తత్త్వజ్ఞానవ్యాజముననుఁ బదంపడి కెల్టుల, స్కాండినేవియనుల, స్లావులయొక్క భావనల, గుప్తవిద్యల, మతముల ప్రబోధము గావించుట యందును మెల్లగి దోడ్పడియు తరువాత ఐరోపా-అమెరికాలలో భౌద్ధమత-దివ్యజ్ఞాన (థీయసోఫికల్) వేదాంత – బాహాఇజం లోనగు ప్రాగ్బోధనల రూపముననుఁ ప్రత్యక్షముగా నేమి బహిరంగముగ నేమి. ప్రవేశించినది.

ఆశియాపై పాశ్చాత్యదాడి రెండుసార్లు జరిగినది. కొంత కాలము పశ్చిమాశియాయందు నాటుకొనియుండి, ఇండియాలో కలవరముగలిగించి, తుదకు మహమ్మదీయ వ్యుత్పన్నత మూలమున, మధ్యకాలపు ఐరోపాను బ్రవేశించినట్టియు నుద్రేకగ్రీకుసంప్రదాయముతో గూడినట్టియు నగు అలెగ్జాండరు దండయాత్ర యొకటి. ప్రాగ్దేశపునీతి, కళ, ఆధ్యాత్మిక వ్యుత్పన్నతలపై నిప్పటి ఐరోపాదేశపు వాణిజ్య, రాజ్యతంత్ర, వస్తుపరిజ్ఞాన శాస్త్రముల నవీనదాడి రెండవది.

ఈ యన్యోన్యసంఘట్టనమునుండి క్రొత్తవిశేషములు రెండు చూపట్టినవి. ఇవి యేక కాలమందు సంభవించుట యొకటి. తమలోని వైపరీత్యముల విశేషించి నొక్కి చూపుట రెండవది. భౌతికవిజ్ఞాన ప్రధానమైన ఐరోపాఖండము ప్రపంచమునం దెల్ల నధ్యాత్మజీవనమునకు హృదయస్థానమైయున్న ఇండియాను గాంచినపుడు, ఇండియా తన జాతియొక్క లౌకిక మానసిక జీవనాభ్యుదయమును నిరసించుచు కేవల మధ్యాత్మజీవనమందే అనేక యుగములుగా నేకాగ్రత వహించుచు ఎటువంటి మహాపరీక్షయందును ఉత్తీర్ణతగాంచుటకై వేదన మందుచుండెను. ప్రాగ్వాహిని ఐరోపాలో బ్రవేశించునపుడు ప్రాగ్దేశము, మతమును భావవికల్పముగను, శుద్ధమనస్సారమగు తత్త్వవిచారమును నిస్సారమగు వాగ్డంభనగను, ఆత్మవిచారమును మిథ్యగను నిరసించి, మానవమేధనంతయును భౌతికశాస్త్రవిచారమునందును మానవ-శారీరక-సాంఘిక - ఆర్థిక - ప్రజాపాలక - జీవనాభ్యుదయము లందును ధారపోయ సమకట్టినటుల ఐరోపాను గాంచినది.

ఆ మహాప్రయత్న మిపుడు పూర్తియైపోయినది. తన యసమర్థతను విపులముగ జాటించకున్నను అసమర్థమే అయినది. ఈరీతినే హైందవ ఆధ్యాత్మికోద్యమముగూడ తన యసమర్థతను జూపెట్టినది. దానివలన నొకానొక డెట్లు మహోన్నతపదవిగాంచునదియు జాతియంతయు భగవానునే కోరి యా తొందరలో మానవకోటి యందలి భగవంతుని యుద్దేశ్యమును మఱచి యెట్లు పతితంబగునదియు జూచియున్నాము. ఐరోపా హైందవోద్యమములు రెండును ఆశ్చర్యదాయకములు; అత్యద్భుత కార్యముల నొనర్చినవి. చివరకు భగవానుడును ప్రకృతియే మానవుని ఆత్మోన్నత్యమునకును మేధోన్నతికిని అందజాలని యగాధము లయ్యెను;

వ్యష్టియందును సమష్టియందును సాధ్యముగానున్న మానవ జాతియొక్క సమంజస సంపూర్ణాభ్యుదయమునందే మానవకోటి విముక్తి యాధారపడియున్నది. మానవజన్మయొక్క ఆధ్యాత్మికతను గుర్తించిననే ఐరోపావారు బాగుపడగలరు. లేనిచో జ్ఞానశూన్యంబగు మేధయందును జీవరహితమగు కట్టుదిట్టములలోను నశింతురు. అట్లే ఆశియాగూడా తాను సురక్షితముగా నుండుటకై తన లక్ష్యసిద్ధికి అనివార్య ద్వారముగానున్న భౌతికమానసికస్థితి నిబంధనలను గుర్తించవలసియున్నది. లేనిచో శరీరమనోబలంబులుడిగి మఱికొంత హీనస్థితికి జెందును. కేవల మన్యోన్య రూపానుకరణం బించుకేని సహకారి కానేరదు. పునర్జీవహేతుకములగు నన్యోన్యాకర్షంబును సుఖకరంబగు సమరససమ్మేళనంబును అవసరము.

ఈ రెండు గొప్పమానవోద్యమములయొక్క ఏక కాల సమావేశ సంయోగములు భవిష్యన్మానవాభ్యుదయమున కాశాపూర్ణములేగాక, అపాయకరములును గాగలవు. భౌతికశాస్త్రాభ్యున్నతులు మానవజాతిని దగ్గరకు జేర్చినవి. మంచికైనను చెడ్డకైనను వాని భవిష్యత్తు ఒకటైయున్నది. అవి స్వతంత్రించి యొక్కొకటి వేర్వేఱు అభ్యుదయముల నికమీద గాంచ నేరవు. భౌతికశాస్త్రాభివృద్ధి యాచరణములచేతను ఆత్మజీవన చేతను అంతర్బాహ్యైక్యమును మానవకోటియందు గాంచ నవకాశము గలుగుచున్నది.

ప్రపంచముయొక్క స్థితిగతుల సత్యమును ధర్మమును తెలిసికొని, దానిచేత జీవనము మానవకర్మలు భావనలు నడవడులు కట్టడులు వీనిని శాసించి, ఇదియే మానవాభ్యుదయసిద్ధులకు త్రోవ యని నమ్మకము గల్గించు ఇచ్ఛయే ఐరోపియన్ జ్ఞానమునకు బీజమైనభావము.

ఈ భావము పూర్ణముగ సరియేయని మే మంగీకరించుచున్నాము. అయినను దానిని ఆచరణలో నుంచుటయందు పొరబాటు జరిగినది. మనము తెలిసికొనవలసినది సత్యము, ధర్మముగాని భౌతిక ప్రపంచమునుగూర్చి కాదు; మనశ్శరీరముల గూర్చియు గాదు. ఇవన్నియు గావలసియున్నను, విడువరానివైనను, వీనికన్నింటికి నాధారమగు నాత్మసత్యమును, ఆత్మధర్మమును దెలిసికొనవలెను. ఏలనన, పదార్థములందలి యాత్మబలమే రూపములయందును వ్యవహారములయందును వ్యక్తమగుచున్నది.

'తన్ను దా తెలిసికొనిననే మానవుడు ముక్తుడగును. ప్రపంచమునంతయు జయించి యాత్మను బోగొట్టుకొనినచో — తన్ను దా గోల్పోయినచో — ఏమి లాభము కలదు ?' అను సత్య సందేశమునే ప్రాగ్దేశము ప్రతీచికి బంపుచున్నది. ప్రతీచి దీనిని విని ఆత్మతత్త్వ ధర్మములను గనుగొన యత్నించుచున్నది. కాని ఇందొక యపాయము గలదు. ఈ ప్రతీచి యత్యంత బహిర్ముఖము మాయికమునగు సిద్ధివిద్యలచే నావృతదృష్టి గావచ్చును. ఇందుకు తార్కాణ మింగ్లాండు, అమెరికా. లేదా విమర్శనా చతురత తత్త్వవిచారకుశలతలచే జర్మనీయందువలె పరమార్థమైన అధ్యాత్మ దృష్టి మఱుగుబడవచ్చును. 'ఆత్మసత్యమే నిశ్చయము యథార్థము నగు సత్య' మను దృఢప్రతిజ్ఞయు, 'ఆత్మసత్యమును బడయుట కధ్యాత్మజీవనమే మార్గ'మను నమ్మకమును, 'ఉత్తమదృష్టితో దాని ధర్మముల గ్రహించి యాచరించవలయు'నను స్థిరబుద్ధియును, విశ్వాసము, 'ఈ మహోద్యమమునకు దగిన సాధనములుగ మానవ బాహ్యజీవనమును, సంఘ నడవడులను నిర్మింప యత్నింపవలయు' నను తీర్మానమును ఆశియాలోని జ్ఞానమునకు బీజములైన భావములు.

ఇదియును యథార్థమగు సత్యమే. దీనినంతయు వేమంగీకరించుచున్నాము. అయినను ఆచరణలో ముఖ్యముగా నిండియా యందాత్మకును తదుపకరణములకును, విభేదము దూరత్వము నారోపించుటచేత జాతియొక్క మనోబాహ్యజీవనలు సంకుచితము లయినవి. ఏలనన, సంపూర్ణజీవనవికాసముపైననే యఖండాత్మ స్థితి యాధారపడి యున్నది. మనపూర్వులీ జ్ఞానమును బడసి

యాచరించిరి. వారి సంతతుల యందీ జ్ఞానము సన్నగిలి నష్టమై ఆచరణలో లేకపోయినది.

ప్రాగ్దేశమునకు ప్రతీచి యొసంగు సందేశము నిజమైనదియే. మానవుడును భగవంతుడే; మానవత్వము వృద్ధిజెందుకొలది దేవత్వమునకు సన్నిహితంబగును; జీవితమును భగవానుడే. దాని వికాసమే బ్రహ్మముయొక్క ఆత్మవికాసము. జీవితమును నిరసించుట అంతర్వ్యాప్తియగు భగవానుని నిరసించినట్లగును. ఇదియే ప్రాచీన జ్ఞానము. ప్రాగ్దేశ మీ సందేశమును విని మేల్కొనుచున్నది. ఆశియా కొంతకాలము తన స్వభావమును ధర్మమును మఱచిపోయి, ఐరోపావిధానమున దానిని గ్రహించి, కేవలము పాశ్చాత్యానుకరణముగనో లేక దూష్యము వికృతమునగు మిశ్రముగనో పాడ నూపవచ్చును. అట్లయిన నది యపాయకరమే.

కావున ప్రస్తుత మాలోచింపవలసిన దేమన; సరియైన భావమును సరియైన సమన్వయమార్గమును గనుగొనుట; మనశ్శరీర జీవితముల నాక్రమించి పూరించి యధిష్ఠించునటుల పురాతనము సనాతనము నగు అధ్యాత్మ తత్త్వమును పునర్నిర్వచనముచేయుట; అత్యుచ్చబలైశ్వర్యములతో, మానవమనస్సు, అంతరాత్మలు, ఆత్మతత్త్వమును వ్యక్తముజేయనోపునట్టి యమోఘమును వీర్యవంతమును నగు నాధ్యాత్మిక శిక్షణలను యోగమును వృద్ధిపఱచుట; బాహ్యజీవనము, సంఘము, నడవడులు ఆత్మసత్యముపై నాధారపడి క్రమముగ పునర్నిర్మితములై మానవుని స్వేచ్ఛను సంఘైక్య

మునకును సంపూర్ణసమరసత్వమును సమకూర్పజాలు సాధనసంపత్తుల గనుగొనుట; ఇవియే ప్రస్తుతము ఆలోచింపదగిన విషయములై యున్నవి.

ఇదియే మాలక్ష్యము, 'ఆర్య'యందలి మాయన్వేషణము. ఈ భావముచే ప్రేరితములైన యుద్యమములు ప్రపంచమం దనేకములు గలవు. అయినను ప్రకృతము వ్యవహారమునందును మత శాస్త్ర సిద్ధాంతములందును గల ఆసక్తిచేత నేర్పడు దృష్టిలోపములేకుండ నీ సమస్యను సర్వభావములతో సంపూర్ణముగ వీక్షించి యంగీక రించుటకు విశేషముగా బుద్ధిబలమును బ్రయోగించవలసియున్నది.

సృష్టికి మూలమగు సత్యమును, అది ప్రకృతియందు వ్యక్త మగునట్టి ధర్మమును అన్వేషించు తత్త్వవిచారమును మత నిర్వచన మును, మానవుడు శుద్ధి సిద్ధులంగాంచు నాధ్యాత్మిక శిక్షణలను, సమరసముజేయు యోగమార్గ ప్రవచనమును, మానవసంఘ జీవన సమస్యల కీ భావముల సమన్వయ మొనర్చుటయు నివి యన్నియు నీ యుద్యమాంశములై యున్నవి.

ఇట్టి యుద్యమమునకు మూలము తత్త్వవిచారము, మత విషయక పర్యాలోచనము. కావున వీనిని త్రోసివేయరాదు. గోచరమగుదాని వెనుకనుండు భావమును ఆలోచించి దాని సాధా రణధర్మమును నిరూపించుటయే మానవుని ప్రబోధచైతన్యము యొక్క లక్షణము, ధర్మమును. ఈ ధర్మనిర్వచనము నే మానవుడు

మతముగా మార్చుకొనును. పదార్థములమూలమునుగూర్చి బుద్ధితో నొనర్చువిచారమే తత్త్వవిచారము. మానవునియందీ సత్యమును జీవయుతముగ జేయుటయే మత మనబడును. ఈ రెండు నన్యోన్యాశ్రయములు. తత్త్వనిరూపణము లేని మతము అంధకారబంధురంబగు మూఢనమ్మకమగును. జీవయుతముగాని తత్త్వవిచారము ఆచరణకు రాజాలనియెడల పనికిమాలిన వెలుతురగును.

కావున 'ఆర్య'లో ప్రథమమున ఈ సమస్యను గూర్చిన తత్త్వవిచారము కడు దీర్ఘముగ నిర్వచనము గావలసియున్నది. ఇట్లు చేయనియెడల మేము వచించునది యథార్థము, ఘనము, శాశ్వతము నగు విలువ గాంచనేరదని మానమ్మకము. కావున మా భావప్రకటనమందేమి ప్రాగ్దేశపు ప్రాచీనజ్ఞానపరిశీలనా పునర్నిర్వచనమునందేమి విశేషించి వ్రాయవలసియున్నది.

మా రెండవతలంపు అధ్యాత్మ యోగశిక్షణములంగూర్చినది. ఇందునను యోగమార్గములను సాధారణ విపులనిర్వచనము గావించుటతోడనే తృప్తిజెందక వాని మూలమును సాంతముగ విచారింపదొడగితిమి. ఇట్లు చేయనియెడల కేవల మార్గనిర్వచనము నిరర్థకము నిరుపయోగము నగును. పూర్వసిద్ధికి సులువగు ననుష్ఠాన మార్గములు గన్పించవు.

* *

మానవజాతియొక్క ఐక్యము ఆంతరంగిక-ఏకత్వముచేతనే గాని కేవలము బాహ్యసంసర్గములవలన గానేరదనియు మానవుడు

మనః ప్రాణశరీరములను మించి యాత్మపథంబు చెందవలయు ననియు అధ్యాత్మబలము దేహమనంబుల బ్రవేశించి మానవునకు అమానుషత్వంబు నొసంగుననియు సామాన్యముగ మేము భావింతుము.

*

* *

మఱియు మానవజాతి ఒక నూత్నజీవనమును గూడ సమకూర్పగలిగిన పరివర్తనమున గూర్చి నడచుచున్నదను భావముతో మేము ప్రారంభించితిమి. ఈ పరిణామమున—ఈ యుద్యమమున—జాతికి సహకారులై దారిచూపగలిగిన ఆధ్యాత్మిక, మత తదితర సత్యాన్వేషణమే మేము లక్ష్యముగా గైకొంటిమి. ఈ యుద్యమమున కాధారభూతములగు నాత్మానుభవము, సత్యదర్శనము మాకు లభ్యమైయున్నది. లేనిచో ఈ కార్యము ను బూనుటకు మా కధికారమేలేదు. అయినను దానిని సమగ్రముగ తెలియ పఱచుటకు ఉత్కృష్టము, గూఢము, కఠినము నగు దీర్ఘచింతనము పలుతెఱంగుల జేయవలసివచ్చినది. ఈ భారమును మామీదను, చదువరులమీదను విధించవలసివచ్చినది.

మాచే ప్రాధాన్యముగాంచిన తత్త్వవిచారమును "దివ్య జీవనము" (The Life Divine) న విస్తరించి నిర్వచనంబు గావించితిమి. ఇందు వేదాంతమార్గానుసారముగ జీవుడు-మనస్సు-ప్రాణము, సచ్చిదానందము-జగత్తు జ్ఞానము, అజ్ఞానము, పునర్జన్మ-

అధ్యాత్మలను గుఱించిన వేదాంతభావములతో ప్రారంభించితిమి. కాని వేదాంతము సామాన్యముగ జీవన నిరసనవిధానమని యూహించుట గలదు. ఇదియే యందు కొంత నొక్కి చెప్పబడి యున్నది. వేదము తొలుత 'సర్వము బ్రహ్మ' మను మూల సత్యముతో ప్రారంభించినను తుద కీజగమంతయు బ్రహ్మముగాదని అనాత్మయేయని గట్టిగా నుడివి విరుద్ధసిద్ధాంతమున పర్యవసించినది. కాని మేముమాత్ర మందలి సిద్ధాంతమునుబట్టి విపులమగు నద్వైత మును స్థాపింప సమకట్టితిమి. మనస్సు, ప్రాణము, జడపదార్థములను ఇవి విశ్వాధారమగు విజ్ఞాన మనబడు అధ్యాత్మమనస్సు ద్వారా ఆత్మనుండియే నిష్పన్నము లయ్యెననియు మనస్సును ఆస్థితి జెందున ట్లభివృద్ధిపఱచినచో జగత్తుననున్న చేతనుని యథార్థ సత్యమును జీవితముయొక్క యథార్థసత్యమును బరమ ధర్మమును మానవుడు పొందగలడనియు మేము నిరూపించుచున్నాము.

ఆత్మయే సచ్చిదానందము. దానికిని ప్రపంచమునకును మానరానివిరోధము కనుపించదు. ప్రపంచమును అజ్ఞానదృష్టితో జూచుచున్నాము, జ్ఞానదృష్టితోచూడవలెను. భౌతికజడతయందు లీనమై పూర్ణచైతన్యమునుగాంచి వృద్ధిజెందుచున్న జ్ఞానమే మన యజ్ఞానము. ఆ పరివర్తనమునుబూర్తిచేసి మానవలోకమున నధ్యాత్మ జీవనమును వికసింపజేయుటకే పునర్జన్మపరంపరలు అవకాశములుగ నేర్పడినవి. పరిణామమందలి సత్యమును మే మామోదించు చున్నాము. పాశ్చాత్యులచే దాని కొసంగబడిన స్థూలరూపమున గ్రహించుటలేదు. ప్రాణము, మనస్సు, ఆత్మ, ఇచ్చట భౌతికములో లీనమై క్రమక్రమముగ వ్యక్తమగుచున్నవను తత్త్వనిరూపణము నే

గైకొనుచున్నాము. ఈ పరిణామముయొక్క శిఖరమున నధ్యాత్మ జీవన దివ్యజీవనయు గలదు.

ఈ సత్యములు పూర్వవేదాంతమునకు భిన్నములు కావని నిరూపించవలసివచ్చినది. కావున వేదమును రెం డుపనిషత్తులను గీతను ఈ దృష్టితో బరిశీలించితిమి. వేదరహస్యము కర్మఠులచేతను పండితులచేతను మఱుగుపడిపోయినది. కావున వేదఋషుల రచన శైలియు వారి సాంకేతికములను అవి తెలియజేయుసత్యములను కొన్ని వ్యాసములలో సూచనగా మాత్రమే నిర్దేశించితిమి. ఉపనిషత్తులలో ఈశ కేనయు గైకొంటిమి. పూర్తిచేయవలయునన్న తైత్తిరీయముగూడ చేర్చవలసియుండెను. కాని అది పెద్దదైనందున గ్రంథవిస్తరభీతిచే వదలితిమి. జీవనతత్త్వముయొక్క అతివిశాలము కార్యాంశము నగు కర్మాచరణమున ఆత్మసత్యము నేరీతి యనుసంధించవలసినది, కర్మ ఏతీరున నధ్యాత్మజన్మను బడయునది మఱియు నధ్యాత్మ జీవనముతోటి దాని సమరసత్వమును గీతనుండి ప్రతిపాదించుచున్నాము. తత్త్వవిచార మాచరణములో నుంచిన గాని సార్థకము గాకుండుటచే 'యోగసంయోజనము' న పలు తెఅంగులగు నధ్యాత్మశిక్షణల మూలతత్త్వములను మార్గములను పరిశోధించి మానవదివ్యజీవనమునకు అవి ఎట్లు సహకారులగు నదియు జూపించితిమి.

అయిన నియ్యది యొకవ్యష్టియొక్క యాత్మాభ్యుదయమునకు

మార్గమే గావున దానిని మానవజాతియొక్క సంఘజీవనమం దా
మా భావ మెట్లు వర్తించునదియు నిరూపించుట కావశ్యకత
యేర్పడినది. అందున 'సాంఘికపరిణామతత్త్వము'న ఈ సత్యము
లెట్లు మానవసంఘపరిణామమునకు తోడ్పడునదియు సూచించితిమి.
'మానవైక్యాదర్శము'న మానవజాతియొక్క ప్రస్తుతపరిస్థితు లే
యే తీరున ఇంకను సన్నిహితమగు నైక్యమును గాంచగూడినదియు,
అందలి శుభసూచనలను విశదపఱచి యథార్థమగు మానవైక్యమును
గాంచుటకు దానిలో నెయ్యది లోపించినదియు గనుపఱచితిమి.

ఈ పతకమున ముఖ్యముగ మూలసూత్రమును మాత్రము
నిర్ణయించి వానిని సంపూర్ణముగ చర్చింపగలిగితిమి.

పై పేర్కొనిన సంకల్పానుగుణముగా 'భాగవత
జీవనము', 'యోగసంయోజనము', 'గీతాభాష్యము',
'వేదరహస్యము', 'ఈశ కేనాద్యుపనిషత్తులు' 'మాన
వైక్యాదర్శము', 'సాంఘిక పరిణామ తత్త్వము' ఈ
విషయములకే ప్రాధాన్య మిచ్చి వీనిని రచించినను,
ఇతర విషయముల నెన్నింటినో వీరు విమర్శించి నిగ్గు
దేల్చి యున్నారు. 'భారతదేశ పునరుద్ధరణము',
'హైందవ సభ్యతాసమర్థనము', 'భావికవిత్వము'
అను విషయములను గుఱించి విపులముగా విమర్శించి
యున్నారు. ఇవిగాక 'యుద్ధము – స్వయంనిర్ణయము',

'సభ్యత', 'యోగము', 'తత్త్వములు' 'పునర్జన్మ-కర్మ' మున్నగు విషయములను గుఱించియు సూక్ష్మముగా తమ సిద్ధాంతముల వెల్లడించియున్నారు. వీరు సంస్కృతమునుండి 'భర్తృహరి' గ్రంథము నాంగ్లమున కనువదించిరి. ఈ 'ఆర్య' మాససంచిక లోని రచనలు కొన్ని 'గీతా భాష్యము', 'భారతదేశ పునరుద్ధరణము', 'యుద్ధము - స్వయంనిర్ణయము', 'దివ్యజీవనము', 'ఈశోపనిషత్తు' మున్నగునవి ప్రత్యేక గ్రంథరూపమున నిపుడు ప్రకటితములై యున్నవి. మఱల నా ఈశ్వరాదేశమున గాబోలు నిరంతరముగా నాఱున్నర సంవత్సరములు సాగనిచ్చిన 'ఆర్య'ను గూడ నకస్మాత్తుగా నిలిపివైచి యోగానుభవములందే శ్రీ అరవిందులు నిమగ్నులైరి. పాఠకులు మానసికముగా గ్రహించగలిగినదంతయు, భాషారూపమున వెల్లడించగలిగినదంతయు సారాంశరూపమున ప్రకటితమైనదనియు, నిక కేవల మాత్మానుభవమువలన యోగసాధనవలన మాత్రమే ఆత్మసత్యమును గ్రహించవలసియున్నదనియు, 'ఆర్య' పత్రికానిర్వహణమునకన్న తదేక నిష్ఠతో నంతఃస్థితముగా నాధ్యాత్మికముగా సృష్టించవలసిన మహత్తరకార్యము లున్నవనియు

దలంచియుండవచ్చును. ఏకారణముననైననేమి తత్త్వ జ్ఞాన ప్రపంచమున 'ఆర్య' పత్రికారూపమున దేదీప్య మానముగా వెలింగిన దివ్యజ్యోతి తన ఏడవ సంవత్సర మున నే యంతరించినది.

ఇక శ్రీ అరవిందుల రచనా మహత్త్వమును గుఱించి, ముఖ్యముగా 'ఆర్య' లోని వాఙ్మయమును గుఱించి ప్రస్తావింపబూనుట మాకుమించిన ప్రయత్నము. శ్రీ అరవిందుల గ్రంథములను చక్కగా బఠించి జీర్ణించు కొనిన పండితులు, ప్రతిభావంతులు, తత్త్వోపాసకు లీ మహత్కార్యమునకు బూని, అపూర్వదర్శన యోగ ముల వెల్లడించిన యోగీశ్వరులుగా, 'అహనా', 'ప్రేమ-మృత్యువు', 'భాజీప్రభువు' మున్నగు రసాత్మకకావ్య ములను 'భావికవిత్వము' అను గ్రంథమును రచించిన కవిచక్రవర్తులుగా, 'భర్తృహరి' 'విక్రమోర్వశీయ' నాటకము మున్నగు సంస్కృత గ్రంథముల ననువదించిన ఉత్తమానువాదకులుగా, వేదవేదాంత గీతాగ్రంథములకు సర్వాంకషవ్యాఖ్యాన మొనర్చిన భాష్యకారులుగా, కజిన్సు ఆర్చర్ మున్నగువారి గ్రంథముల సాకల్యముగా విమర్శించిన విమర్శక విచక్షణులుగా, విద్యావిశార దులుగా నిట్లు వేత్యేఅు వారియనంతగుణముల సూక్ష్మ

ముగానేని వెల్లడించి ఆంధ్రలోకమునకు మహోపకార మొనరింతురు గాకయని ప్రార్థితులు. కాని శ్రీ అరవిందుని రచన కేవలము బుద్ధిబలముతో, ఆలోచనసామర్థ్యముతో చర్చించి, తర్కించి, ప్రాకులాడి ప్రయత్నమున వ్రాయ బడినది గాక వేదకాలపు ఋషిపుంగవులవలె ద్రష్టయై అంతఃస్థిత ప్రేరణమున వెల్లివిరిసిన వాఙ్మయమనిమాత్రము చెప్పనగును. 'ఆర్య' పత్రికాపాఠకులకు శ్రీఅరవిందులు ఋక్కులగాన మొనరించిన ఋషికవియని, సర్వతోముఖపాండితీ విభాసియని, సర్వజ్ఞుడని కొంత తెలియగలదు. శ్రీ వారు శిష్యుని కొక లేఖలో వ్రాసిన విషయము లీ సందర్భమున అప్రస్తుతములు కావని సంగ్రహముగా నిట నుదాహరించుచున్నాము:...

......నే నెన్నడును సుతరాం తత్త్వవేత్తగానుండలేదు. యోగాభ్యాసమునకు పూర్వము పుదుచ్చేరి చేరకముందు నాకు తత్త్వశాస్త్రమును గురించి తెలిసియుండినది స్వల్పమే. వస్తుతః కవిగా రాజతంత్రజ్ఞుడనుగా మాత్రమే యుంటిని. తత్త్వశాస్త్రజ్ఞుడనుగా మాత్రము కాదు.

నే నెట్లు తత్త్వవేత్త నైతిని? దీని కొక గాథ కలదు.

తాత్త్వికమాసపత్రిక కొకదానికి వ్యాసముల వ్రాసిపెట్టి సాయపడుడని నన్నొక రడిగియుండిరి. యోగి దేని నేని నిర్వహించుటకు సిద్ధముగా నుండవలయునను సిద్ధాంతము నాది; అందువలన నాతని కోరికను నిరాకరించలేకపోతిని. ఇంతలో (౧౯౧౪) యుద్ధము ప్రారంభమై ఆ మిత్రుడు దేశము వదలిపోవలసివచ్చినది. అపుడు ప్రతిమాసము నొంటరిగా నే నొక్కడనే తత్త్వశాస్త్రములతో అరువదినాల్గు పుటల నింపవలసిన భారము పైబడినది.... అనుదినము యోగాభ్యాసము చేయునపుడు గుర్తించి తెలిసికొనిన దాని నంతను బుద్ధిగ్రాహ్యముగా వ్రాయుటసంభవించినది. తానంతటనదే తత్త్వశాస్త్రమైనది!

శ్రీ అరవిందులు మత, రాజకీయ, సాంఘిక, సారస్వతాది కళావిశేషముల నన్నింటిని ఆధ్యాత్మిక దృష్టితో సమన్వయ మొనరించి వానియన్యోన్య సంబంధమును పరమార్థమును వెల్లడించియున్నారు. సుప్రసిద్ధ పాశ్చాత్య కవిశేఖరులగు షేక్స్పియర్, మిల్టన్, వర్డ్సువర్త్, షెల్లీ, కీట్సు మున్నగు ప్రాచీనులయొక్కయు బర్నార్డ్షా, వెల్సు, రసల్ (ఎ.ఐ.) మున్నగు నాధునికులయొక్కయు కావ్యముల నన్నింటిని ఆమూలాగ్రముగ విమర్శించి అంతర్ముఖదృష్టితో కావ్యప్రపంచమున వారి

వారి యథాస్థాన మిదియని సోదాహరణముగ శ్రీ అర
విందులు నిర్ణయించిన విషయము వారు రచించిన ‘ భావి
కవిత్వము’ను, దిలీపకుమార రాయకృత ‘అనామి’ అను
బంగాళీ గ్రంథములో ప్రకటితములైన వారి లేఖలను
బఠించినవారికి స్పష్టము కాగలదు. వారి యాంగ్లరచనా
నైపుణ్య మసామాన్యము. అందు మహత్తరమైన ఆధ్యా
త్మికభావముల పరిమళము గుబాళించుచుండును. కొం
గ్రొత్త శయ్యాపాకములు, విశిష్టము నసాధారణము నగు
భా వా ర్థ ము ల నీను నూతనపదజాలములు, పోకడలు
గలవు. ఇట్లతీత విజ్ఞాన విభూషణములతో శ్రీఅరవిందు
లాంగ్లభాషాకన్యను సర్వశోభాలంకృతం గావించి భాషా
ప్రపంచమునం దగ్రపీఠమున నెక్కించిరి. ఆత్మానుభవము
లేక కేవలము హేతువాదమునకు తర్కమునకు బుద్ధి
సూక్ష్మతకు ప్రత్యక్ష భౌతికశాస్త్ర పరిశోధనా పరీక్షల
కును ప్రాముఖ్య మొసంగుటయే గాక ఆ ద్యం త ము
లివియే యను పాశ్చాత్యలోకమునకు యోగాభ్యాస
పూర్వకానుభవములను, వేదకాలపు సిద్ధాంతములను,
తత్త్వసూత్రములను, పరమధర్మములను, సత్యములను,
పరమార్థమగు భాగవత జీవనరహస్యమును సహేతుక
ముగ సప్రమాణముగ శాస్త్రీయముగ సర్వతోముఖ

ముగ వెల్లడించి ప్రాచ్య పాశ్చాత్య సభ్యతాసంకలనము గావించి ప్రపంచకల్యాణ మొనర్చుటయే భగవానుని సంకల్పమాయనునట్లు శ్రీ అరవిందుల నిరుపమానాంగ్ల రచనావైభవము స్ఫురింపజేయుచున్నది.

ముందీ తరంగముననే 'ఆర్య' పత్రికనుండి యను వదించి యుదాహరించిన 'మాయాదర్శము' అను భాగ మును పాఠకులు పఠించియే యున్నారు. అందు మానవ జాతి యొక నూత్న జీవనమునుగూడ సమకూర్పగలిగిన పరివర్తనకేసి నడచుచున్నదని తాము గ్రహించితి మనియు, ఆ సత్యాన్వేషణమువలన దానిని సాధించుటకు వలయు ఆత్మానుభవము తమకు లభించి యధికారుల మైతి మనియు శ్రీ అరవిందులు సూచించియున్నారు. ఈ విషయమును గుఱించియే మఱికొంచెము వివరముగా ౧౯౨౨-వ సంవత్సరము నవంబరు తే ౧౮ దిని కీ॥ శే॥ దేశబంధు చిత్తరంజన్ దాసు గారికి వ్రాసిన యుత్తర ములో చేర్కొనియున్నారు. శ్రీ అరవిందులు దేనిని సాధించి తన్మూలమున మన బుద్ధి మనఃప్రాణశరీరముల నెట్లు బరిశుద్ధమొనర్చి నూతనజీవనమును దివ్యజీవనమును స్థాపింపదలంచినదియు, వారు బహిరంగముగా కర్మక్షేత్ర మున బ్రవేశించుటకుగల అభ్యంతరమేమైనదియు కొంత

నెఱుంగనగును. ఆయుత్తరములోని ఈభాగమునుమాత్ర
మనువదించి యీ క్రిందఁ బొందుపఱచుచున్నాము.

ప్రియమైన చిత్రా!

జీవితము, కర్మానుష్ఠానము వీనిపట్లగల నాయిప్పటి భావవైఖ
రులు, ఇవియే నన్నిచ్చటికి గొనివచ్చిన విషయము మీకు తెలియు
ననియే తలంచెదను. ఒక నూతన పునాదికి ఉద్గమించిన గాని
నిరంతరము నిష్ఫలమై పరిభ్రమించెడు చక్రమునుండి మానవుడు
వెలువడిరాలేడను విషయము నాకు మఱింత నెక్కువగా విస్పష్ట
మైనది. ఈనిజమైనయాధారము—జీవితమునకు, కర్మానుష్ఠానమునకు
వలసినది—ఆధ్యాత్మికమని, అనగా యోగమువలన మాత్రమే
పెంపొందించగల నొకనూతన చేతనయని నాకవగతమైనభావము
రూఢమైనది. మఱియు ప్రపంచమున కీ గొప్పవిజయమును
జేకూర్చుట ఇండియాకర్తవ్యకర్మ (మిషన్) యని నేను విశ్వసించు
చున్నాను. ఈ భావము నాకెప్పుడు నుండెను. మునుపంత స్పష్ట
ముగా తీవ్రముగా లేకుండెను. ఇపుడన్ననో అది యధికాధికముగా
దృఢమైనది. కాని ఈ మహత్తర చేతనయొక్క క్రియాస్వభావ
మేమి? దానిఫలప్రదమైన యథార్థస్థితి ఏమి? దానినెట్లు క్రిందికి
గొనివచ్చి, సన్నాహ మొనర్చి, వ్యవస్థపఱచి జీవితమున కుపయోగిం
చుట? మన ఇప్పటి యుపకరణములను, 'అనగా, బుద్ధి మనః

ప్రాణ శరీరములను, ఈ మహాపరివర్తనమునకు యథార్థము, శుద్ధము నగు సాధనములుగా - వాహినులుగా - నెట్లు చేయగలము ? ఈ సమస్య నే నాస్వానుభవమున బరిష్కరింప బ్రయత్నించుచుంటిని. నా కిపుడు దృఢమైన యాధారము, విస్తృతజ్ఞానము, ఈ రహస్య సమస్యావిషయమున నధికారవిశేషము లభించియున్నది. ఇంకను దాని పరిపూర్ణత్వము, దానిని పూర్తిగా చెలాయించగల స్థితి నాకు లభించలేదు. అందువలననే నే నింకను ఏకాంతముగా నుండవలసి యున్నది. ఏలనన, నాకీ నవీనశక్తియొక్క స్వామ్యము స్పష్టముగా సంపూర్ణముగా లభించినగాని బహిఃక్షేత్రమున కర్మనారంభించ రాదని, చక్కని పునాదిమీద తప్ప నన్యత్ర నిర్మాణ మొనర్చ రాదని నేను నిశ్చయించితిని.

అరవిందఘోషు.

*

* *

ఇట్లు రాజకీయరంగమును సంపూర్ణముగా బరిత్యజించి శ్రీఅరవిందులు కేవల మాధ్యాత్మిక ప్రపంచము ననే సమస్తశక్తుల వినియోగించి విహరించుచున్నను

బొంబాయిలోని 'టైమ్సు ఆఫ్ ఇండియా' పత్రిక వీరిపై నింకను రాజద్రోహనేరమొకటి యున్నట్లును పుదుచ్చేరినుండి కాలుకదుపగనే నిర్బంధింపబడునట్లును ౧౯౦౮లో మానిక్‌తులా కుట్రసంభంధమున - అదియే ఆలిపూరు బాంబుకేసు - వీరు పరారియై వచ్చినట్లును సూచించుచు సంపాదకీయ వ్యాసమును ౧౯౨౭-వ సంవత్సరమున వింతగా బ్రకటించి దేశారాధకులపట్ల తనకుగల ద్వేషబుద్ధినే గాక తన యజ్ఞానమునుగూడ ప్రదర్శించుకొనినది. ఈ వ్యాసమున కపుడే యది యసత్యపువ్రాతయనియు దురుద్దేశ్యముతో వ్రాయబడిన దనియు ఖండించుచు ఏనేరమును శ్రీ అరవిందులపై లేదని యథార్థ మెఱింగిన యొకానొక న్యాయవాది ప్రత్యుత్తర మిచ్చియుండెను. మఱియు నీ విషయము మద్రాసుశాసనసభలో ప్రశ్నింపబడుటయు శ్రీ అరవిందులపై నేదోషారోపణముగాని తత్సంబంధమైన వారంటుగాని లేదని ప్రభుత్వమువారిపక్షమున ప్రకటింపబడుటయు నందఱెఱింగినవిషయమే.

# శ్రీ అరవింద జీవితము



## ఆఱవ తరంగము

### ఏకాంతవాసము

'ఆర్య' మాస పత్రికా ప్రకటన మాగిపోయినది మొదలు సుమారైదుసంవత్సరములవఱకు శ్రీ అరవిందులు యోగసాధనయందే మఱింత నిమగ్నులై యుండిరనువిషయముతప్ప మఱేమియు బాహ్యప్రపంచ మెఱుంగుటకవకాశము గనపడదు. ఆకాలమున శిష్యుల నంతగానెవరిని శ్రీ అరవిందులు స్వీకరించకుండిరనియు, నప్పటికే తమ్మాశ్రయించి యుండిన కొద్దిమంది శిష్యుల కనుదిన మొకటి రెండుపర్యాయములు దర్శన మిచ్చుచు వారితో సంభాషించు చుండిరనియు, ప్రత్యక్షముగా

వారి సాన్నిధ్యమున గొంతకాల మాశిష్యులు ధ్యాన మొనర్చుచు సాధనచేయుభాగ్యము నందియుండిరనియు దెలియుచున్నది.

శ్రీ అరవిందుల జీవచరిత్రమున - కాదు ఆధ్యా త్మిక ప్రపంచముననే - ౧౯౨౬-వ నవంబరు తే ౨౪ ది అత్యంత ముఖ్యమైన పుణ్యదినము. నాడు శ్రీ అరవిందుల సాధన యందొక మహత్తరమైన అంతర్ఘటనము సంఘటిల్లెననియు నాటినుండియే తమ్ము శరణుజొచ్చిన శిష్యులకుగూడ పరోక్షులై ఏకాంతవాసము నారంభించిరనియు వినుచున్నాము. నాటి యంతర్ఘటన మాహాత్మ్య మేమో దాని యంతరార్థపరిమితు లేవో మనకు తెలియవు. యోగానుభవము లేనివారు లోపభూయిష్ఠమైన పృథక్ దృష్టిగల మానవప్రజ్ఞతో నావిషయముల నూహించుట కష్టము. ఐనను పరిణామ ప్రక్రియ ననుసరించియో భగవానుడు తన్ను మఱింతమఱింత భూలోకమున నావిష్కరించుకొనుట వలననో ప్రాణిక కక్ష్యమాత్రమే నెలకొనబడియుండిన భూలోకమం దున్నతతరమైన మనఃకక్ష్య శ్రీ రామావతారమున స్థాపితమైనట్లే ద్వంద్వములకు త్రిగుణములకు నతీతమైన ఘటియొక ఆధికాధికోన్నత తరమైన కక్ష్య శ్రీ కృష్ణావతారమున నెలకొల్పబడినది. దానినే అధిమనస్సని, అతీతతమనస్సని, అతీత మనఃకక్ష్యయని (Overmental Plane) పేర్కొనెదరు. అదే దేవధామము, దేవలోకము. శ్రీ అరవిందు లా

నాశ్రు ఆకత్యునందుకొని ద్వంద్వాతీతుడు త్రిగుణాతీతుడు నయ్యెనని చూచాయగా తెలియుచున్నది. కాని నాటి నుండియే శ్రీ అరవిందులయోగ శక్తి కొంత బహిర్గత మగుట కుపక్రమించినదనియు ఆ యుపక్రమణముయొక్క ప్రారంభఫలమే శ్రీ అరవిందాశ్రమరూపము దాల్చిన దనియు విశ్వసింపబడుచున్నది. శ్రీ అరవిందులు గడించిన ఆయోగశక్తియొక్క - ఆ పరాశక్తియొక్క - దివ్యరూప లక్షణములును, ఆ శక్తిస్వరూపిణి యగు లోకేశ్వరీ వాత్సల్యానుగ్రహమువలన లభింపగల మహద్భాగ్య ములును, సాధకుడా మహాదేవి కరుణాకటాక్షమునకు పాత్రుడు గాగల సాధనవిధానములును కొంతకుగొంత సూత్రప్రాయముగా 'తల్లి' ( Mother ) అను దివ్యగ్రంథ మున పేర్కొనబడియున్నవి. ౧౯౨౬-వ సంవత్సరమున కావల శ్రీ అరవిందు లేకాంతవాసము నారంభించిన తరువాత వ్రాసిన గ్రంథరాజమే యియ్యది.

## శ్రీ తల్లిగారు 'పుదుచ్చేరి' దర్శించుట

పది పండ్రెండేండ్ల పసితనమునుండియే యోగాను భూతులుగల ఫ్రెంచి దేశపు విదుషీమణి, శ్రీ అరవిందుల వలె, దివ్యజీవనమును పూర్ణయోగమూలమున భూలోక

మందు స్థాపించవలయు నను స్థిరసంకల్పము గల్ల మహా
యోగిని, ౧౯౧౪-వ సంవత్సరారంభమున శ్రీఅరవిందు
లను పుదుచ్చేరిలో భౌతికముగా ప్రత్యక్షముగా దర్శిం
చుట సంభవించినది. భారతదేశమే తన నిజమైన మాతృ
దేశముగా భావించి విశ్వసించిన ఆ స్త్రీరత్నము, ఆనాటి
యుద్ధపరిస్థితులవలన నేర్పడిన ప్రభుత్వమువారి నిర్బంధ
మూలమున నిచ్చట నుండజాలక ఇండియానుండి మరలి
పోవలసివచ్చినను యుద్ధానంతరమున ౧౯౨౦-వ
సంవత్సరము ఏప్రిల్ తే ౨౪ దిన తనతల్లి దేశమునకు
వచ్చి స్థిరనివాస మిచ్చుట నేర్పాటు చేసికొనిరి. ఆమెగారి
ప్రేరణోత్సాహముల శక్తిసామర్థ్యముల వలననే
శ్రీ అరవిందుల లక్ష్యలక్షణములకు దగిన యోగసాధన
ఆశ్రమనిర్మాణములు క్రమక్రముగా రూపముదాల్చ
నారంభించెను. శ్రీ అరవిందులు ౧౯౨౬ నవంబరు
తే ౨౪ దిని ఏకాంతముగా నివసించ నారంభించినది
మొదలు ఈ మహాదేవియే సాధనార్థమై తమ్మాశ్రయించి
వచ్చిన సాధికాసాధకుల కుపదేశాదేశముల ననుగ్ర
హించుచు ఆశ్రమ వ్యవహారాది కార్యముల విజయ
వంతముగా నిర్వహించుచున్నారు.

## శ్రీ అరవిందాశ్రమము

భరతఖండమున నాశ్రమయుగము ప్రారంభమగు చున్నదా యనునట్లు సర్వత్ర ఆశ్రమములు వెల్లివిరియు చున్నవి. ఆధ్యాత్మిక, మత, విద్యావిషయక సంబంధమే గాక కేవలము రాజకీయ సాంఘిక సంబంధముగాని తుదకు వడకుట నేయుట మున్నగు పరిశ్రమ సంబంధముగాని గల సంస్థలును కర్మాగారములును నేడాశ్రమ నామముతో వ్యవహరింపబడుచున్నవి. ప్రాచీనసంప్రదాయముల నీవిధముగ బునరుద్ధరించ వలయునను ఉత్కంఠకు దోడు, పాశ్చాత్యసంపర్కమున గాబోలు, వ్యక్తి స్వాతంత్ర్యమని, సమష్టి పరిపాలనమని, ప్రతివానికిని స్వామ్యాధికారము లుండవలెనని భావాందోళన మాయాశ్రమముల నిర్వహణమందును జెలరేగుచున్నది. ఈ సమయమున శ్రీ అరవిందు లాశ్రమములగుఱించి, వాని నిర్వహణము గుఱించి, తమ ఆశ్రమ మే విధముగా నుత్పత్తియైనదియు దానిసంకల్ప మేమైనదియు ఆ విషయములనుగుఱించి ౧౯౩౪-వ సంవత్సరమున ప్రకటించిన వ్యాసము మిక్కిలి యుపయోగకరమై ఆశ్రమధర్మ సూత్రముల నెఱుంగుట కనువుగా నుండునని దాని యాంధ్రానువాదము నీక్రింద బొందుపఱచుచున్నాము.

ఆశ్రమ మనగా నధ్యాత్మతత్త్వోపదేశకుని లేక నాచార్య పురుషుని గృహము లేక గృహములు. తత్త్వోపదేశమునకు, తదభ్యాసమునకు తమ్మాశ్రయించి వచ్చువారిని అనుమతించి తావొసంగుదురు. ఆశ్రమ మొక సమాజము గాదు, మతసంస్థ గాదు, మతమును గాదు,—కేవలము పైన జెప్పినదే తప్ప తదితర మేమియు గాదు.

ఆశ్రమములోని సర్వస్వము గురువుగారిదే; సాధకుల కే విషయమునను, ఏవిధముగను హక్కు గాని, స్వాతంత్ర్యము గాని, పెత్తనము గాని లేదు. వా రచ్చటి నుండుట గాని, వెళ్ళిపోవుట గాని గురువుగారి యభీష్టానుసారముగా నే యుండును. గురువున కర్పించు ద్రవ్య మంతయు వారి సొంత ఆస్తియేగాని ప్రజాసంస్థకు సంబంధించదు. ప్రజాసంస్థయే కానందున నా ద్రవ్యము సమష్టిమూలధనముగాని, నమ్మకముగా ధర్మకర్తపర మొనర్చిన నిధిగాని కాజాలదు. క్రీస్తున కనేక శతాబ్దములకు పూర్వమునుండియే భరతఖండమున నిట్టి యాశ్రమము లుండియుండెను; విశేష సంఖ్యాకములుగా నిప్పటికిని గలవు. ఆ గురువునుబట్టియే అంతయు నాధారపడి యుండును. ఆ గురుస్థాన మాక్రమించగల మఱొకగురు వున్ననే తప్ప నది యాగురువు జీవితాంతముతోనే యంత మొందుచుండును.

పుదుచ్చేరిలోని యాశ్రమ మీ విధముగా నుత్పన్నమైనది. ప్రారంభమున పుదుచ్చేరిలో శ్రీఅరవిందులు కొద్దిమంది సహచరులతో తనయింట నివసించుచుండెను. తదుపరి మఱికొందఱు వారిని ఆశ్రయించిరి. కొంతకాలమున కావల ౧౯౨౦-వ సంవత్సరమున శ్రీతల్లిగారు వారితో జేరినతరువాత శిష్యులసంఖ్య మిక్కిలి పెరిగి

నందున వచ్చినవారికి నివాససౌకర్యముల నేర్పాటుచేయుట అవసరమాయెను. తన్నిమిత్తము గృహములు క్రయమునకు బాడుగకును తీసికొనబడెను. ఆగృహముల సరిగా నుంచుటకు, మరమ్మత్తులు చేయుటకు, పునర్నిర్మాణ మొనర్చుటకు, భోజనములకు, సలక్షణముగా నివసించుటకుగూడ నేర్పాట్లు చేయవలసివచ్చెను. ఇవన్నియు సొంతముగా శ్రీ తల్లిగారొనర్చిన పద్ధతులే. వీనిని సవరించుటకుగాని, మార్చుటకుగాని, పెంచుటకుగాని శ్రీతల్లిగారే సర్వస్వతంత్రలు. ఇందితర ప్రజాసంబంధ మేమియు లేదు.

ఆశ్రమగృహములకన్నింటికిని శ్రీ అరవిందులు లేక శ్రీ తల్లిగారు సొంతదారులు. వ్యయమొనర్చు ద్రవ్యమంతయు శ్రీ అరవిందులది లేక శ్రీ తల్లిగారిది. శ్రీ అరవిందుల కృషికి సాయపడునట్లు పెక్కుమంది ద్రవ్య మొసంగెదరు. ఇచ్చట నున్న వారిలోను కొందఱు తమ యాదాయము నర్పించుచుందురు. కాని యిది కేవలము శ్రీ అరవిందులకు లేక శ్రీతల్లిగారికి నియ్యబడుచున్నదే గాని ప్రజాసంస్థగా నాశ్రమమునకు గాదు. అట్టిసంస్థయే లేదు.

ఈ యాశ్రమ మొక సమాజము గాదు; నియమితసంఘ మేదియు లేదు; అధికారోద్యోగులు లేరు, సంఘమునకు జెందిన సమష్టియాస్తి యేదియు లేదు. ఎట్టువంటి పరిపాలకవర్గము, సంఘమును లేదు. ప్రజాబాహుళ్యమునకు సంబంధించి చేయు కార్యకలాపమేమియు లేదు.

ఈ యాశ్రమ మొక రాజకీయ సంస్థ కాదు; ఆశ్రమవాసులందఱును రాజకీయోద్యమములతో నెల్లసంబంధమును విసర్జించినవారే. మతవిషయక రాజకీయ సాంఘిక ప్రచారముల నన్నింటిని



ప్రతి సాయసమయ మందలు శ్రీ తల్లిగారిని దర్శించు ప్రదేశము — ఆశ్రమ గృహమున నుత్తర భాగము.

ఆశ్రమవాసులు సంపూర్ణముగా వదలుకొనవలసియున్నది.

ఈ యాశ్రమ మొక మతసంస్థ కాదు. అన్ని మతములవారును నిచ్చట గలరు. ఏ మతమునకు జెందనివారును గొందఱు గలరు. ఇచ్చట నెట్టి మతసిద్ధాంతభావముగాని నిర్ణీతమత సంప్రదాయ విశ్వాసముగాని మతపరిపాలనాసంఘముగాని లేదు. ప్రకృతి యొక్క యున్నతపరిణామదశను ప్రజ్ఞను వ్యాప్తిగావించుటకు, సత్యమును గ్రహించుటకు, కోరికలకు లోబడక వానిపై నాధిపత్యము వహించుటకు, ప్రతిమానవవ్యక్తియందును నిగూఢమై యున్న చైతన్యమును దివ్యాత్మను గనుంగొనుటకు, చిత్తైకాగ్రతా ధ్యానములకు సంబంధించిన కొన్ని ఆంతఃకరణికసాధనములు శ్రీ అరవిందుల యుపదేశములును మాత్రమే యున్నవి.

ఈ యాశ్రమ మితర ఆశ్రమముల బోలినది గాదని, ఈ యాశ్రమవాసులు గృహస్థులుగాని సన్యాసులుగాని గాదని చెప్పవచ్చును. పృథివిపై నింతవఱకు నావిష్కరింపని యొక నూతన శక్తిని అవరోహింపజేసి తన్మూలమున మానవజాతిని దివ్యజాతిగా పరివర్తన మొనర్చు మహత్తమ కార్యమునకు సన్నద్ధులుగా నగుటయే ఈ యాశ్రమ సాధకుల ప్రధాన లక్ష్యమనియు తెలియుచున్నది.

ఈ యాశ్రమ ప్రవేశమునకు తదితర సంస్థలకు

వలె బాహ్య నియమము లేవియు నంతగా గన్పించవు. ధనము గాని, పాండిత్యము గాని, మామూలు కీర్తి ప్రతిభా ప్రతిష్ఠలుగాని, కులగౌరవములుగాని ప్రవేశార్హతను గలిగింపవు. స్త్రీ పురుష భేదముగాని యువకులు వృద్ధులు నను వయోనిర్ణయముగాని లేదు. ఎవరైనను శ్రీ అరవిందుల అనుగ్రహభాగ్యముననే ఆశ్రమ ప్రవేశమును గాంచవలసియున్నది. శ్రీవారే లక్షణములను బట్టి నిర్ణయింతురో ఎట్టివారిని స్వీకరింతురో ఎట్టివారిని నిరాకరింతురో మన మూహించజాలము. కేవలము బాహ్యస్థితులనుబట్టి గాక అంతఃస్థితముగానే యోగాభిలాషుల యోగ్యతాయోగ్యతలను శ్రీ అరవిందులు నిర్ణయింతురని భావింపవచ్చును.

ఆశ్రమప్రవేశమున కింతటి సూక్ష్మధర్మముల ననుసరించి పరీక్షలు జరుగుచున్నను, ఎందఱినో నిరాకరించుచున్నను, దారపుత్రాది కుటుంబ సంబంధమే గాక దేశ సంబంధము సర్వము త్యజించి కేవలము 'భగవానుని కొఱకే, భగవత్ ప్రీత్యర్థమే' అను మహత్తమ లక్ష్యముతో యోగసాధన జేయు వారీ యాశ్రమమునందు సుమారాఱువందలమంది గలరు. ఇందు స్త్రీలు మాత్రము సుమారు రెండువందల మంది. ఇంచు మిం

చన్ని రాష్ట్రములవారును గలరు. ఆశ్రమ వాస్తులలో వంగీయులే యెక్కువ మంది యని చెప్పవచ్చును. బరోడాలో శ్రీ అరవిందులు పదుమూడు సంవత్సరములు నివసించియుండినందుననో తొల్లింటి ద్వారకానగర సామీప్య భాగ్యసంబంధముననో భక్తిప్రేరితులగు గుజరాతీయులసంఖ్య ద్వితీయ స్థాన మాక్రమించుచున్నది. ఆశ్రమము దక్షిణదేశమం దుదయించియున్నను సమీపమందున్న ద్రావిడాంధ్ర కర్ణాటకేరళుల సంఖ్యమాత్రము క్రమక్రమముగా స్వల్పమై పూజ్యముగా నున్నది. ఇట్లు భారతీయులే గాక యూరోపు అమెరికా దేశీయులును - స్త్రీ పురుషులు-కొందఱు గలరు. హిందువులు, బౌద్ధులు, జైనులు, పారశీకులు, మహమ్మదీయులు, క్రైస్తవులు నిట్లన్నిమతముల వారును గలరు. కాని ఆశ్రమము ప్రవేశించిన తరువాత నే మత సంప్రదాయములును పాటింపబడవనియు శ్రీ అరవిందుల శిష్యవర్గముగా మాత్రమే పరిగణింపబడుననియు తెలియుచున్నది.

ఈ యాశ్రమ మందలి సాధకులలో విద్యాధురీణులు, మేధావంతులు పలువురుగలరనియు, అసాధారణ ప్రతిభగల కవులు, గాయకులు, చిత్రలేఖకులు, కళానిపుణులు కొందఱు గలరనియు, యోగోపాసనయందు,

భగవద్దారాధనయందు మాత్రమే ఆత్మార్పణముగా విని యోగించు వారి శక్తిసామర్థ్యములు దివ్యపరిణామమును గాంచుచున్నవనియు స్వానుభవముగలవారు పలువురు వెల్లడించియున్నారు. సాధకులందఱకును గురువు ప్రభువు శ్రీ అరవిందులేగాని మధ్యవర్తిత్వము పౌరోహిత్యము నెవరికిని లేదు. భక్తిజ్ఞానము లుపాంగములుగా నున్నను కర్మయే శ్రీ అరవిందుల యోగమందు ప్రాధాన్యము వహించియున్నందున సాధకులు సాధనగా తమ గురువర్యు లాదేశించిన కర్మల నాచరించుటయందే నెక్కువ కాలము గడుపుచుందురు. శిష్యులలో సమానప్రతిపత్తియే ప్రతివారికిని గలదు గాని ఎక్కువ తక్కువ లేమాత్రమును లేవు. బాహ్యనియమము లంతగా నీ యాశ్రమమందు గనుపించకున్నను బ్రహ్మచర్యమందు పట్టింపు తీవ్రముగా గలదు. దంపతులుగా నుండిన వారును గొందఱు కలరు. కాని యొకానొకని కళత్ర సంతాన మని, బంధుమిత్రు లనిమాత్రము గాక ఆయా వ్యక్తుల కీ సాధనయందు యోగమునందు గల అభీప్స ననుసరించియే. యోగ్యతనుబట్టియే ఈ యాశ్రమ ప్రవేశమున కవకాశముగలదు. స్త్రీలకు సాధారణముగా ప్రత్యేకగృహములందు బస లొసంగబడుచున్నవి.

ఇక ఆశ్రమమందొసంగు నాహార విషయమును గుఱించి : అన్నింటినిద్యజించి యోగముకొఱకే యాశ్రమమున శరణుజొచ్చిన వారి విషయమున రుచుల కంత ప్రాముఖ్య ముండజాలదు. అయినను అట నొసంగు నాహారము బలకరము నారోగ్యప్రదమునై శుచిగా నుండును. యోగసాధనకు కేవలము సాత్త్వికాహారమే యుండితీరవలయునను నియమముకంటె భిన్నభిన్నరుచుల కలవడిన పాశ్చాత్య దేశీయులకు భరతఖండములోని నానారాష్ట్రవాసులకు అందఱకు నింపితముగా ననుకూలముగా నుండవలయునను సమన్వయసిద్ధాంత మనుష్ఠింపబడుచున్నది. కాని మాంసాది ఆహారములు (కోడిగ్రుడ్డు సహితము) నిషిద్ధములు. మిరపకాయలు, ఉల్లిపాయలు, ఇంగువ, ఆవాలు మున్నగు ఘాటుపదార్థముల నుపయోగింపరు. చింతపండుకు బదులుగా నిమ్మకాయల నుపయోగింతురు. పండ్లు, పాలు, పెరుగు, రొట్టె, వరియన్నము, పప్పులు, కూరలు ఇవియే ముఖ్యములు. ఆహారవస్తువుల పరిశీలించి శుభ్రపఱచుట, గోధుమపిండి తయారుచేసి రొట్టెలుచేయుట, వంటచేయుట, వడ్డించుట తుదకు బియ్యమును తయారుచేయుట, భుజించిన పాత్రలను శుద్ధిచేయుట, ఆశ్రమవాసుల వస్త్రము ల నుతుకుట

సర్వము నాశ్రమ సాధికా సాధకులే చేయుచుందురు. కార్యకలాప మంత బాహుళ్యము గా నున్నను ఈ యాశ్రమమందుగల ప్రశాంతి వాతావరణము నిరుపమానము. వంటశాలయందుగాని భోజనశాలయందుగాని మఱేకార్యరంగమందుగాని శాంతిసౌరభములే వెదజల్లు చుండును. మామూలు హడావడి, అట్టహాసములు నుద్వేగవిశేషము లేవియు గనపడవు. కార్యనిమగ్నులగు సాధకులు కర్తృత్వమును తాము వహించక ఏ మహాశక్తియో, దివ్యప్రజ్ఞయో తమచేత చేయించుచున్నదని తాము నిమిత్తమాత్రులమని భావించి శాంత్యానందముల ననుభవించుచుందురు.

ఆశ్రమ గృహముల ప్రత్యేకవిశేషము వాని శుభ్రత యందు. ఆ శుభ్రతను బట్టియే ఆశ్రమగృహము లివిగదా యని ప్రేక్షకులు గుర్తించగలరు. పూదోట లేని ఆశ్రమగృహమే లేదని చెప్పవచ్చును. ప్రతిగృహమందు నానావిధములైన సజాతీయ విజాతీయములగు పూ మొక్కలు కనులపండువుగా కమ్మనివాసనల నీనుచు చూపరుల కానందము గొల్పుచుండును. ఆశ్రమ పూదోటలంగల నానావిధ పుష్పజాతులు మఱెచ్చటను గానరావనియు నట. సుమారు మూడువందల భిన్న భిన్న

జాతుల పుష్పములు గలవనియు ప్రతి పుష్పమునకు నొక్కొక్క చిహ్నము, గుణము గలదనియు—'తులసి' భక్తిచిహ్నముగా, 'గులాబి' సమర్పణ చిహ్నముగా నెన్నబడునట్లు—పుష్పముల కెక్కువ ప్రాముఖ్యము గలదనియు తెలియుచున్నది.

ఆశ్రమ విద్యాలయము :

మూడు నాల్గేండ్లకు పూర్వము పండ్రెండేండ్లకు మించని చిన్నవారిని సాధారణముగా నాశ్రమములో జేర్చుకొను నవకాశమే లేకుండెను. ఆశ్రమము నాశ్రయించి సాధన చేయువారి సంఖ్య పెరుగుకొలదియు కొందఱు కుటుంబముతో వచ్చి చేరుట సంభవించినది. తమబిడ్డల కితరాశ్రయము, మఱొక మార్గము లేని తల్లిదండ్రులు తమబిడ్డలను వెంటదీసికొనివచ్చుట అనివార్యమాయెను. కాని చిన్నపిల్లలకు మున్ముందు శరీరాభివృద్ధి తదనుగుణముగా మానసికాభివృద్ధి ప్రాధాన్యముగాని యోగము కాదు. అందువలన నట్టివారినిమిత్తమై విద్యాలయమును రెండుమూడేండ్ల క్రిందటనే స్థాపించిరి. నూరుమంది వఱకు, విద్యాలయమున, బాలికాబాలకులు గలరు. ఫ్రెంచి, ఇంగ్లీషు, సంస్కృతము, దేశభాషలలో హిందీ, బెంగాలీ, గుజరాతీ, అరవము మున్నగు భాషలు

గణితము, చరిత్ర, భూగోళశాస్త్రము, పదార్థ విజ్ఞాన-రసాయన-ఆరోగ్యాదిశాస్త్రములు, లలితకళలు మున్నగునవి బోధింపబడును. నానావిధములైన బంతియాటలు, కసరత్తులు, సాములు మున్నగునవి నిపుణుల యాజమాన్యమున నేర్పబడుచున్నవి. విద్యార్థుల నిమిత్తమే పెద్ద మొత్తమును వెచ్చించి ఈదుట కొలకొలను నవీన పద్ధతులమీద సముద్రతీరమున నిర్మితమగుచున్నది. వివిధములైన చేతిపనులుగూడ నేర్పబడుచున్నవి. ఇంకను ప్రథమదశలోనే బాల్యావస్థలోనే యున్నదని సంపూర్ణ రూపమును గైకొనలేదని చెప్పవలయును. ఈ విద్యాలయమున కేవిధమగు ప్రభుత్వ సంబంధమును లేదు. ఆశ్రమమే ప్రజాసంస్థ గానపుడు తత్సంబంధమైన ఈ విద్యాలయమును గాదుగదా!

శ్రీ అరవిందాశ్రమ ముద్రణాలయము :

శ్రీ అరవింద వాఙ్మయ మింకను ముద్రితము గావలసియున్న దెంతోగలదు. నానా భాషలలో శ్రీవారి గ్రంథము లనువదింపబడుచున్నవి. ఆశ్రమ సాధకులుగూడ నానాభాషలలో గ్రంథముల రచించుచున్నారు. ఆంగ్లమున బెంగాలీ, హిందీ, గుజరాతీ, మరాటీ, అరవభాషలలో వార్షిక సంచికలుగా త్రై

మాసిక సంచికలుగా వెలువడుచున్నవి. ఇట్లు శ్రీ అర
విందవాఙ్మయ మభివృద్ధియగు కొలది మేలురకము
ముద్రణాలయ మవసరమాయెను. మఱియు విదేశముల
కేగి ముద్రణ సంబంధమైన కళావిశేషముల చక్కగా
గ్రహించివచ్చి, ఒక గొప్ప ముద్రణాలయాధికారిగా
ఇరువదైదేండ్లుగా ననుభవపరులైన విద్యాధికు లొకరు
ఆశ్రమ సేవచేయ సంసిద్ధులై వచ్చియుండిరి. అందువలన
శ్రీ అరవిందముద్రణాలయ మను పేర కొన్ని లక్షలు
వెచ్చించి ముద్రణాలయ మిటీవలనే స్థాపితమైయున్నది.
అందు ఫ్రెంచి, ఇంగ్లీషు, బెంగాలీ, గుజరాతి, మరాటీ,
హిందీ, సంస్కృతము, అరవము, ఆంధ్రము ఈ భాష
లలో ముద్రితములగుచున్నవి. మఱియొక విశేషమేమన,
అధికతమసంఖ్యగా అక్షరములుగల తెలుగుభాషయందు
తప్ప తక్కినభాష లన్నింటియందును 'మోనోటైపు'
అను నూతన యంత్రమువలన నెప్పటికప్పు డక్షరములు
తయారగుట, కూర్పు (కంపోజింగు) జరుగుట. వేతన
ముల మీద పనిచేయువారితో బాటు సాధికా సాధకులు
నన్నిశాఖలలో పనిచేయుచుందురు. శీఘ్రకాలమున ఈ
ముద్రణాలయ మింకను కొంగ్రొత్త యంత్రములతో
ఇండియాలో గల నుత్తమోత్తమ ముద్రణాలయములలో

నొకటిగా నేర్పడగలదని ఆశించగలము.

గోల్కొండ :

అనుదినము సాధకులసంఖ్య పెరుగు కొలదియు విదేశములకు వెళ్ళి అచ్చటనివసించుచుండిన 'పుదుచ్చేరి' వారును మరలివచ్చి స్వపట్టణముననే స్థిరనివాసు లగు చున్నందునను, అన్నిపట్టణములందువలె, పుదుచ్చేరియం దిచ్చటను ఇండ్ల కఱవు తీవ్రతర మగుచున్నది. ఆశ్రమ సమీపమున ఖాళీస్థలములు గూడ కానరావు. ఏట్లో కొద్దిపాటిస్థలము లభింపగా నచ్చట నేబదిగదులతో-క్రింద పునాదిపైనున్న శ్రేణిలోని గదులుగాక-ఆగంతుకులైన భక్తులు ఆశ్రమవాసులు నివసించుట కాధునిక సౌకర్య విలాసములతో కొంగ్రొత్త ఫక్కిలో నొక మూడంతస్తుల గృహము నిర్మింపబడినది. ఆశ్రమమున ఇండ్ల ఇబ్బందిని గమనించిన యొకా నొక ప్రముఖుని ప్రేరణోత్సాహ ములవలన లక్షరూపాయల నొక సంస్థానము గృహనిర్మా ణమునకని విరాళమిచ్చియుండెను. కాని ఈ కట్టడమునకు దాదాపు మూడులక్షలు వ్యయమైనట్లు తెలియుచున్నది. దీనినే 'గోల్కొండ' యని పేర్కొందురు. ఇటుకరాయి గాని, కొయ్యగాని ఈ గృహమున కుపయోగించలేదు. అంతయు సీమెంటు కాంక్రీట్ మయము. కిటికీలుగాని



ఆశ్రమ విద్యాలయమందలి బాలికా బాలకుల వ్యాయామ దృశ్యము

తలుపులుగాని లేవు. అట్లని గాలి వెలుతురు కొఱవడక వలయునంత పుష్కలముగా వచ్చునట్లు, అనగా ఎక్కువ గాగాని తక్కువగాగాని మన కిష్టమైనంత వచ్చునట్లు, ఏర్పాట్లు గలవు. స్నానమునకు వేడినీళ్ళు చన్నీళ్ళు వచ్చు కొళాయీలు గలవు. బట్టలు స్వయముగా నుతికి ఆరవేసికొనుటకు, నౌకరులద్వారా ఉతికించి ఆరవే యించుకొనుటకు చక్కని యేర్పాట్లు వేలువేలుగా గలవు. శౌచక్రియలకు జపాను పద్ధతి ననుసరించి కొంగ్రొత్త పద్ధతు లమర్చబడి యున్నవి. ఈ కట్టడము నకు వలయు బల్లలు, కుర్చీలు, మంచములు, బీరువాలు, దోమతెరలు మున్నగునవన్నియు నాశ్రమమందే ఎంతో నాణ్యముగ నవీనరీతి తయారుచేయబడినవి. ఈ గృహనిర్మాణవిధానము విదేశమునుండిందు నిమిత్తమే ఆశ్రమమునకు వచ్చిన అటోనియర్ రెమాండ్ అను సుప్రసిద్ధులగు వాస్తువిజ్ఞాన నిపుణులు, గృహనిర్మాతలు తయారుచేసినది.

గోశాల :

ఆశ్రమమున కిపుడిపుడే గోశాల యేర్పడు చున్నది. ఒంగోలు, సింధు జాతి ఆవులు మొత్తముమీద పశు సంతతి అఱువది డెబ్బది వఱకు గలదు. ఇంకను

నూర్లకొలది ఆవుల సంఖ్య పెరిగినగాని ఆశ్రమమున కవసరమైనపాలు, పెరుగు లభ్యముగాదు. అంతవఱకు పాలమ్ముకొనువారి మీదనే ఆధారపడవలసి యున్నది. ధారాళముగా పశువులు మేయుటకుబీళ్ళు ఇతరవసతులు త్వరలో లభించి గోశాల అభివృద్ధిగాగలదని తలంతుము.

తోటలు :

ఆశ్రమమునకు కొన్ని మెట్ట మాగాణీభూములు, తోటలు గలవు. కొద్దిగా ధాన్యమును, నానారకముల కూరగాయలను పండించెదరు. కూలీలతో బాటు అవసరమేర్పడినపుడా యా సమయములలో సాధికా సాధకు లన్నిపనులను జేయుచు తోడ్పడుచుందురు.

ఇక శ్రీ అరవిందులను దర్శించు విషయమున నొక్కమాట. శ్రీ అరవిందులు ౧౯౨౬-వ నవంబరు తే ౨౪ ది ఏకాంతవాసము ప్రారంభించినప్పటినుండియు నెవరికిని గనపడుట లేదు. వారి నాశ్రయించి ఎన్నేండ్లో ఆశ్రమమందున్న శిష్యులకేని సంవత్సరమునకు మూడు పర్యాయములు మాత్రమే శ్రీ అరవిందులను దర్శించు భాగ్యముండెడిది. అప్పుడైనను నిమిషకాలము శిష్యులొక్కొక్కరు భక్తితో శ్రీ అరవిందులను సమీపించి వారి పాదారవిందములకు నమస్కరించుటయు శ్రీ అర

విందులు తమ దివ్యహస్తముతో స్పృశించి శిష్యుల నాశీర్వదించుటయు మాత్రమే. సంభాషించుట గాని సన్నిధానమున నొక్కింతసే పుండుట గాని సంభవింపదు. కాని ౧౯౨౮-వ సంవత్సరము మేనెలలో శ్రీఅరవిందు లేకాంతవాసము స్వీకరించిన స్వల్పకాలముననే రవీంద్ర కవి శ్రీవారిని సందర్శించ నభిలషించి యనుమతికి వ్రాసి కొనినట్లును, అపు డెవరిని చూడరాదని యెవరితోడను మాటాడరాదని తా మేర్పఱచుకొనిన నియమమునకు శ్రీ అరవిందులు అరుదుగా మినహాయింపు గావించు చుండినందున, కీ॥ శే॥ రవీంద్రుని కవకాశ మిచ్చినట్లును దెలియుచున్నది.

ఆవల ఈ దర్శనవిషయమై రవీంద్రు డొక రస వత్తరమైన వ్యాసము రచించి శ్రీ అరవిందుని స్తుతించి యుండెను. అందు చిరకాలముగా శ్రీ అరవిందుని జూడ వలయునను అభిలాష తీవ్రముగా తమ కుండెననియు, నా డది సిద్ధించెననియు, శ్రీ అరవిందుని దర్శించినంతనే అంతర్జ్యోతి వారిముఖకమలమున బ్రకాశించుచుండినట్లు వా రాత్మోపలబ్ధికై చేసిన ప్రయత్నము పరిపూర్ణముగా ఫలప్రదమైనట్లు, వారి యోగలక్ష్య మీ లోకమం దీ శరీరమునే, అహంకార వర్జితము షరమవిజ్ఞాన విలసి

తము నగు పరిపూర్ణ విలాసమును సమగ్రముగా నిత్య జీవితమందు ప్రతిష్ఠించుటయే గాని ఏదో పరమని పలాయనమగు సన్న్యాసము గానట్లు, ఆత్మను క్షోభపెట్టు త్యాగము బాధానుభవము లివియే పరమార్థములుగా భావించు యూరోపియన్ మతాచార్యుల వద్దనుండి - రషియా క్రైస్తవ సన్న్యాసులనుండి - శ్రీ అరవిందు లేనాడును పాఠముల నేర్చుకొననట్లును వారి సాన్నిధ్య మందు తమకు ప్రత్యక్షమై నిండు విశ్వాస మేర్పడిన దనియు రచియించియుండిరి. మఱియు నత్యంతగాధమగు పరమప్రశాంతినుండియే శబ్దము, వాక్కు వెలువడు చున్నదనియు, ఆ వాక్కునుండియే నూతన ప్రపంచసృష్టి యుత్పన్న మగుచున్నదనియు, అట్టి దివ్యవాక్కు శ్రీ అర విందుని యందు దున్నదనియు రవీంద్రు డిట్లు వెల్లడించెను. " ఆ వాక్కు మీ యందున్నది. దానిని గ్రహించి శిర సావహించుటకు మేము ప్రతీక్షించుచున్నాము. 'న న్నాల కింపు' డని భరతఖండము మీ కంఠద్వారమున ప్రపం చమున కుపదేశించుచున్నది.'' లోగడ చేర్కొనినట్లు 'ఓ అరవిందా! రవీంద్రుని వందనముల నందికొమ్ము' అని రవీంద్రుడు తనలోతాను భక్తిమెయి పునశ్చరణ మొనర్చి కీర్తించితిమనియు వ్రాసియుండిరి.

వారిని దర్శించగల యవకాశము మొదట మూడు పర్యాయములే. అవి ఫిబ్రవరి తే ౨౧ ది, ఆగస్టు తే ౧౫ ది, నవంబరు తే ౨౪ ది అయియుండెను. ౧౯౩౯-వ సంవత్సరమునుండి తే ౨౪ ది ఏప్రిలునందు మఱొకదర్శనము లభించుచున్నది. అందువలన సంవత్సరమున కిపుడు నాల్గుదర్శనములు. ఆ సమయము లందాశ్రమమందున్న శ్రీవారిశిష్యులే గాక దూర ప్రదేశములందున్న శిష్యకోటిలో పలువురు దర్శనభాగ్యము నందుచుందురు. ఈ దర్శనములు యోగసాధన జేయు శ్రీ అరవిందశిష్యుల నిమిత్తమే యుద్దేశింప బడినను, ఆశ్రమముతో నేదోయొక సంబధముగలవారు ఆశ్రమాభిమానముగలవారు పలువురు ముందుగా ననుమతి బడసి ఆసమయమున వచ్చుచుందురు.

## యుద్ధము – శ్రీ అరవింద సాహాయ్యము

గత ద్వితీయ ప్రపంచయుద్ధమున శ్రీఅరవిందులు శ్రీ తల్లిగారు, ఉభయులును, మిత్రమండలి – అనగా ఫ్రెంచి, అమెరికా, బ్రిటన్లు – విజయమునే కాంక్షించి తమ సహానుభూతిచిహ్నముగా కొంత ద్రవ్యమును రాజప్రతినిధి నెలకొల్పిన యుద్ధనిధి కొసంగుచు తత్సంబంధ

ముగా మద్రాసు గవర్నరున కొక లేఖ వ్రాసియుండిరి. శ్రీ అరవిందులు శ్రీ తల్లిగారు ఆ యుద్ధ విషయమై వ్రాసిన కొన్ని లేఖలు ప్రకటితమై యున్నవి. వానిని బఠించిన వివరముగా తెలియగలదు. యుద్ధ మన నేమి ? అందులకు కారణము లెవ్వి ? ఈ యథార్థమును జాగ్రదావస్థలో కేవలము బాహ్యాభుక్కుల మగు మానవమాత్రులము గ్రహింపజాలము. శ్రీ అరవిందుల దృష్టి నుండి యతి సూక్ష్మముగా వెల్లడింప బ్రయత్నింతుము.

అనంతుడగు భగవానుని ఆవిష్కార పరంపరలు గూడ ననంతములు. అందలి ప్రధానావిష్కారములనే తొల్లింటి వేద ఋషులు స్వానుభవముతో సప్త లోకములు, భూమికలు, కక్ష్యలుగా బేర్కొనియున్నారు, పరాశక్తి మూలమున పురుషోత్తముని యావిష్కారము పరమునుండి, పైనుండి క్రిందికి, అవరమున కవరోహించు నపు డెల్లను క్రిందనుండి, అవర ప్రకృతి నుండి, నిరోధ ములు నానారూపములుగా వెలువడుచుండును. ఆ పర మావిష్కారము భూలోకమున నిట నెంత తీవ్రముగా నవరోహించ బ్రయత్నించునో అంత తీవ్రముగానే అవరశక్తులును బ్రతిఘటించ నెత్నించును. ఈ ప్రతి ఘటనములే ఇట్టి మహాయుద్ధములు. అనగా నంధకారము

—వెలుగు జ్యోతులమధ్య, సత్యాసత్యములమధ్య, దైవము — దైవేతరములమధ్య, సురాసురులమధ్య యుద్ధము. ఈశ్వర రాజ్యమును దేవరాజ్యమును స్థాపించు సంకల్పముననే, పరిణామప్రక్రియననుసరించి, అవతారములును. ఈశ్వరశక్తి యావిష్కరింప జేయనున్న మహర్లోకము, విజ్ఞానభూమిక (సూప్రమెంటల్ ప్లేన్) అవరోహణమై భూ - భువర్ - స్వర్లోకముల నిచ్చట పృథ్వియందు గట్టిగా పాదుకొనెనేని రాక్షసుల అసురుల ప్రాబల్యమంతరించును. తమ యునికికే కొన యూపిరితో నున్నవీరు దైవమును దైవశక్తులను నిరోధించు ప్రయత్నమే గతయుద్ధము.

అందువలననే శ్రీ అరవిందులాయుద్ధము శ్రీ తల్లిగారిది, జగన్మాతది యని, అసురోపకరణమగు నొక అవరశక్తియే హిట్లరు రూపము దాల్చినదని, హిట్లరుకు ఆతని పక్షమునకు పరోక్షముగానేని విజయమును దలపోయువారు తమకు తెలియకనే మహాపచారము ద్రోహమును జేయుచున్నారని తెలిపియుండిరి. బాహ్యదృష్టితో ఆయుద్ధము కొన్నిజాతు లితరజాతులపై లేవదీసినదిగా భావింపరాదనియు, భూలోకమున నెలకొనవలసిన యొక పరమాదర్శము, పరమలక్ష్యము, సంపూర్ణముగా నను

భూతి గాంచవలసిన సత్యము, స్వాతంత్ర్యాధ్యాత్మి కోన్నతులు, వీని నసురులు తీవ్రముగా నెదుర్కొని మానవ స్వాతంత్ర్యమును ఆత్మాభివృద్ధిని భంగపఱచి తమ ప్రాబల్యమునే స్థిరముగా నెలకొల్పు ప్రయత్నమే ఆ యుద్ధమని శెలవిచ్చియున్నారు.

అట్లని మిత్రమండలివా రందఱు పవిత్రరూపము దాల్చిన పుణ్యపురుషులని యెవరును జాటుటలేదు. మానవుల నందఱను తర తమ భేదములతో స్వార్థము ద్వేషా సూయాదు లావేశించి యున్నవనుట మఱువ రాదు. కొందఱ యదృష్టమున కాబోలు తమకు తెలి యకనే దైవోపకరణములుగా దైవపక్షమున కీడ్వబడు చుందురు. పరదేశాక్రమణకు పరపీడన మొనర్చుటకు నలవడి, వానిని త్యజించజాలక వికారములకు లోనగు చున్నను, ఏవో కొన్నియున్న తాదర్శముల కేసి యాకర్షింప బడుచు, నానాజాతుల సమ్మేళన మని, లోకుల కందఱకు సమానమైన సర్వస్వాతంత్ర్యమని, మానవైక్యమని, శాంతి సౌఖ్యము లని ప్రసంగించువారు మిత్రమండలి వారు. భీషణ సంగ్రామమందు చావుబ్రతుకులో నున్న పుడుగూడ, తమదేశమం దేని వాక్స్వాతంత్ర్యమును యథేచ్ఛగా నొసంగినవారు బ్రిటీషువారు. ఇక హిట్ల

రన్ననో సకలజాతులలో తన జర్మనుజాతియే సర్వవిధ ముల శ్రేష్ఠమని, తన జాతియే సర్వ ప్రపంచమును పాలించవలయునని, తదితరజాతులు తమ్మాశ్రయించి యుండవలయునని ప్రబోధించి జర్మనుల వీరావేశమున ముంచెత్తి యుండెను. మఱియు రంగుజాతులు, నల్లవారు, భారతీయులు అజ్ఞానులని, స్వపరిపాలన కయోగ్యులని, నూడిగముచేయుచు బ్రతుకవలసినవారే యని తుదకు వారిని చదివించరాదనియు, తన 'మీ౯ కాఫ్' బైబిల్‌నం దుద్ఘాటించుట కాతడు వెనుదీయలేదు. యూధు లను ఆధునిక మారణ యంత్రముల వలన కుతంత్రముల వలన చిత్రవధగావించి యా జాతినే నిర్మూలింప నాజ్ఞా పించినాడు. తన సిద్ధాంతముల, విధానముల, ఆవేశముల కెల్ల తాళమువేయుట కెవరు తన దేశమందు—ఉన్నతో ద్యోగులు గాని, రణవీరులు గాని, తన ప్రాబల్యమునకు దోడ్పడిన మిత్రులు గాని — మానసికముగానేని సంశ యింతురని తన కేమాత్ర మనుమాన ముదయించినను వెంటనే వారినెల్ల హతమొనరించిన ఆతతాయి. పాఠక లోకమున కీ ఘోరములు తెలియనివి కావు. ఇతర దేశములమాట ఎట్లున్నను, భారతదేశము తన స్వాతం త్ర్యమును బడయుటకు తన నిరుపమానమగు సంస్కృతీ

సభ్యతలను ఆత్మజ్ఞానమును బోషించి పెంపొందించుటకు నవకాశమే శూన్యమైయుండును హిట్లరే వినాశముగా నుండ నుండినయెడల. ఆర్యావర్తము తన యపూర్వ విజ్ఞానముతో తన్నుద్ధరించుకొనుటయే గాక తన ఆధ్యాత్మిక శక్తిని సభ్యతాదులను సకల ప్రపంచమున వ్యాపింప జేసి భాగవతజీవనమును స్థాపించి శాంతిసౌఖ్యములతో లోక కళ్యాణ మొనర్చవలసియున్నది.

ఆవల ౧౯౪౨-వ సంవత్సరారంభమున క్రిప్సు రాయబార మిండియాకు వచ్చుటయు బేరములుసాగి విఫలమగుటయు లోకమెఱింగినదే. నాడట్లువిఫలమగుట వలన దేశ మనుభవించిన నానా యాతనల గుఱించి, ఎందుల కే విధముగా విఫలమైనదో ఆ విషయముల గుఱించి భావిచరిత్ర కారుడు వివరముగా చర్చించి వ్రాయ గలడని విశ్వసించుచున్నాము. కాని శ్రీ అరవిందులు ౧౯౧౦ వ సంవత్సర ప్రారంభమున మన దేశ భవిష్యత్తును, కాదు ప్రపంచ భవిష్యత్తును, గుఱించి సూచించియుండిన ఆశ్రమ కార్యదర్శి లేఖ నిట నుల్లేఖించు చున్నాము.

౧౯౪౬ లో మన దేశమునకు వచ్చిన బ్రిటీషు క్యాబినెట్ మిషన్ 'విషయమై శ్రీ అరవిందుల అభి

ప్రాయమును బ్రసాదించగోరుచు కలకత్తాలోని 'అమృత బజారు పత్రి' కాధిపతులు ప్రాధేయపడగా శ్రీ అరవిందాశ్రమ కార్యదర్శిగా రిట్లు ప్రత్యుత్తర మిచ్చియుండిరి :

ఏదో అధికారరీత్యా వారిని సమీపించి కోరినపుడు తప్ప తనంతటతానే తన అభిప్రాయముల దెలుపుట అనవసరమని శ్రీ అరవిందులు తలంచుచున్నారు. వారి భావమేమో తెలిసినదే. దేనిని స్వగౌరవముగల జాతికి యోగ్యమైన ఏకాదర్శముగా, ఏ రాజీకిని లొంగక, బహిరంగముగా ప్రప్రథమమున వారు చాటినారో అట్టి ఇండియా సంపూర్ణ స్వాతంత్ర్యమునే వా రెప్పుడును గోరుచున్నారు.

౧౯౧౦-వ సంవత్సరమున భవిష్యత్తును గుఱించి తత్ఫలమును గుఱించి చెప్పినవిషయ మధికారపూర్వకముగా * ప్రకటితమై యున్నది. అది, నాలుగేండ్ల కావల దీర్ఘకాలపు యుద్ధములు, ప్రపంచ వ్యాప్తములైన సంక్షోభములు, విప్లవములు ప్రారంభమై తరువాత ఇండియా స్వాతంత్ర్యమును బొందగలని. ఆ స్వాతం

* 'ధర్మ' అఱవపత్రికయందు ప్రకటితము. స్వర్గీయులు, చిరస్మరణీయులు, వఱకవి సుబ్రహ్మణ్య భారతిగారి సాయముతో శ్రీనివాసాచారిగారు స్థాపించియుండిరి. ఆ పత్రికాధిపతులు సజీవులై మద్రాసులో నున్నారు.

త్ర్యము శీఘ్రముగా వచ్చుచున్నదని, ఏదియు దానిని నిరోధించ జాలదని ఇటీవలనే శ్రీ అరవిందులు దెలిపియున్నారు. మనదేశ స్వాతంత్ర్యమును అంగీకరించుచు అన్యోన్యముగా నొడంబడిక చేసికొనుటకు బ్రిటీషువారు ఇండియాకు వచ్చెదరనియు నెప్పటి నుండియో గుర్తించియున్నారు. వారట్లు ముందుగా కనిపెట్టినదే ఇపుడు ప్రత్యక్షమగుచున్నది. బ్రిటీషువారి క్యాబినెట్ మిషను దాని చిహ్నమే. ఇక నీ యవకాశమును సరిగా సంపూర్ణముగా నుపయోగించుట జాతీయనాయకులపనియై యున్నది. ఏమైనను సరియే, ఉత్తరక్షణమున ఫలితమెట్లుగా పరిణమించినను, ఈ సంఘటనమునకై కృషిచేయుచున్న మహాశక్తియొక్క తుదిఫలము నిరోధింపబడజాలదు. ఇండియాయొక్క స్వాతంత్ర్యము, విముక్తి నిశ్చయము.

యోగలబ్ధమైన పరమసత్యమెఱుంగని దివ్యదృష్టిలేని మానవ శ్రేష్ఠులు నాయకోత్తములుగూడ పరీక్షాసమయము వచ్చినపుడు కర్తవ్యమూఢులై దిగ్భ్రమచెంది నిర్వీర్యులగుదురు. జూన్ ప్రారంభమున సంభవించినదిదే. 'భారతఖండము ఏకము నవిభాజ్యము. ప్రాణములనైన పణమొడ్డి దేశవిభజన కంగీకరించరా' దని తుదిక్షణమువఱకు గర్జించి, ఎలుగెత్తి చాటిన నాయకోత్తములు, పరవశులై కాబోలు, అతృప్తులు, అసంతుష్టులు

నైగూడ దేశవిభజనమును సిరసావహించిరి!

౧౯౪౭ జూన్ ౩ వ తేదిని కట్టకడపటి బ్రిటీషు ప్రతిపాదనను గుఱించి చేసిన బ్రాడ్ క్యాస్టును వినుచుండగా (శ్రీ) తల్లిగారికి అంతర్వాణి మూలమున లభించిన సందేశ మపుడే పత్రికాముఖమున బ్రకటితమైనది. దాని సారసంగ్రహము నిట నుదాహరించెదము :

"ఇండియా స్వాతంత్ర్య ప్రదాన నిర్ణాణము లందుగల క్లిష్టసమస్యలను, గట్టిచిక్కులను, బరిష్కరించు నిమిత్త మొక ప్రతిపాదన మొనర్పబడినది. ఎవరికిని తృప్తి నియ్యనప్పటికిని విచారకరముగా నయోగ్యముగా నున్న విషయము నెఱింగియు ఇ ం డి యా నాయకులు దాని నంగీకరించినారు.

కాని అసలీ ప్రతిపాదన మెందు కొనర్చబడినదో మీకు తెలియునా? మన చిల్లిజగడము లెంత నిరర్థకములో హాస్యాస్పదములో మనకు ఋజువుచేయుటకే. ఈ ప్రతిపాదనమును మన మెందులకు శిరసావహించవలయునో మీకు తెలియునా? మన పిచ్చితగాదా లెంత నిరుపయోగములో నవ్వులపాలో మ న ం త ట మనకే ప్రత్యక్షముగా ఋజువగుటకు.

ఇది పరిష్కారముగాదు. మ హా ప రీ క్ష, అగ్ని

పరీక్షయే యనుట స్పష్టము. దీనిని యథాతథముగా ననుష్ఠించినయెడల దేశైక్యతను, ఔన్నత్యమును సాధించుట కాదేశమును ముక్కలు ముక్కలుగాజీల్చి ఖండించుటవలనగాదని మనకు ఋజువగును. అన్యోన్య విరోధముగా, నొండొరుల స్వార్థములను అవసరములను నిరోధించుకొనుట వలనగాదు దేశసౌభాగ్యమును గడించుట. ఒకపక్షముగావించు పిచ్చి సిద్ధాంతములకు మొండిపట్టులకు అన్యపక్ష మట్లే యడ్డు తగులటవలనగాదు మనము నిజాత్మను దేశాత్మను సేవించగలుగుట. ఏమైనగానిండు, ఇండియా కొకే యాత్మగలదు. ఏకము నవిభాజ్యమునగు ఇండియాను గురించి ముచ్చటించగల వఱకు నిరీక్షించుచుండవలసిన కాలములో 'ఇండియా ఆత్మ చిరంజీవి యగుగాక 'అని మన యాక్రందనము.''

శ్రీ తల్లిగారి యీ సందేశమును దేశ మెట్లు గ్రహించునో తెలియదు. కాని శ్రీఅరవిందులు ౧౯౦౫ లోనే స్పష్టపఱచినట్లు ఇండియా దేశము జడపదార్థము గాదు. కొన్ని బయళ్ళు, క్షేత్రములు, వనములు, పర్వతములు నదులుగా నెఱుంగరాదు; తల్లియే. మానవునికివలె జాతికి దేశమునకును ఆత్మగలదు. సజీవమైన వ్యక్తిత్వముగలదు. జాతి కేవలము వ్యక్తులయొక్క

కూటమి, సమూహముగాదు. జాతియందు మానవునకు వలె చైత్యాత్మ (చైత్యపురుషుడు) గలదు. అందు ప్రజ్ఞా శక్తి యున్నది. తదనుగుణముగా ఆ దేశముయొక్క సంకల్పము వికాసము, ఆంతరిక జీవనముతో బాటు, బాహ్యజీవనమునకు వలయు రాచకీయ, ఆర్థిక, సాహితీ సభ్యతాది ఉపపత్తులను నిర్ణయించుకొని రక్షించు కొనగలదు.

జాతియొక్క జీవితచరిత్రమందును ఎన్నో విషమ పరిస్థితులు, ఘటనలు, దినగండములు దాపరించుచు దాని యునికికే భంగము రావచ్చును. బ్రిటన్, ఫ్రెంచి దేశములు లేదా జాతులును ఈ యాతనల ననుభవించి తమయందంతర్గతమైన ఆత్మశక్తివలన పునరుద్ధితమైన విషయము చరిత్ర చాటుచున్నది. కొన్నిజాతులు తొల్లింటి గ్రీక్, రోము, ఈజిప్ట్, చాల్డియా, బెబులిన్ అసలే అంతరించినవి. ఇండియాదేశ మట్లుగాదు; తన లోని యవయవము లన్యోన్యముగా శత్రుత్వమువహించి వినాశమునకు దారితీసినను, ఈ మహావ్యాధివలన ప్రాణో పద్రవమేర్పడినను పునరుద్ధరణము గాగల జవసత్త్వ ములు ఆత్మశక్తి ఈ జాతియందు గలవు. మానవజాతి నుద్ధరించవలసిన కర్తవ్యధర్మము 'మిషన్' ఇండియాకు

గలదు. అది నెఱవేఱినగాని దాని మనుగడ సార్థకము గాజాలదు. శ్రీ తల్లిగారు ప్రకటించినట్లు మనల నావే శించిన దివ్యేతరశక్తు లంతరించి మన మొఱ లీడేరి అఖండమైన భరతమాత మన కచిర కాలముననే ప్రసన్న మగుగాత యని ఆ పరాశక్తిని ప్రార్థింతము.

## శ్రీ అరవిందోపదేశము

శ్రీ అరవిందులు స్వప్రయత్నమున యోగ మారంభించి సుమారు నలుబది సంవత్సరములు మాత్రమే దాటినట్లొక కాలనిర్ణయము ప్రత్యక్షముగా గనబడుచున్నను ఆజన్మముగా వారియందు యోగబీజము లంకురించి యభివృద్ధిగా నారంభించినట్లును పదునాల్గు పదునెనిమిది సంవత్సరముల చిఱుప్రాయముననే, అనగా నేటికి సుమా రరువది సంవత్సరముల క్రిందటనే, వారి కంతస్స్థితముగా నొక యాదేశము, ఒక కర్తవ్యము సువ్యక్తమైనట్లును శ్రీవారి లేఖలే సూచించుచున్నవి.

మన కంటికగపడు జగద్రూపముల కావల, ఆత్మ చైతన్యముల సత్యము ఏకము నిత్యము నగు సర్వ భూతాత్మ కలదను ఆర్యావర్తపు ఋషుల సిద్ధాంతము నుండియే శ్రీ అరవిందుల యుపదేశము ప్రారంభ మగు

చున్నను లక్ష్యలక్షణము లందు వైలక్ష్య విశేషములు లేకపోలేదు. ప్రపంచమును గుఱించిన భావము లింత వఱకించుమిం చీవిధమున ద్వివిధరూపముల వెల్లడింప బడియున్నవని చెప్పనొప్పును.

అందు బుద్ధుని, శంకరుని భావ మీ విధమై యుండుట మొదటిది: ప్రపంచము మాయ, భ్రమ, అజ్ఞాన క్షేత్రము. ఆ అజ్ఞానమే సకల బాధ హేతువు. సాధ్యమైనంత త్వరితముగ నీ జగత్తునుండి తప్పించుకొని పోవుట, ఆద్యమైన అవ్యాకృతమైన సత్తునందో అసత్తునందో మాయ మగుట, ఇది యొక్కటియే మన కర్తవ్యము.

సాధారణముగా గ్రహింపబడిన వేదాంతమార్గ మీ రెండవది: భగవానుడు సర్వవ్యాపి గాన జగత్తు గూడ మూలతత్త్వమున నిశ్చయముగా భగవంతుడే. కాని ఆ జగద్బాహ్యరీతి – వెలుపలి ఆవిష్కారము – వికృతమై, మఱుగై, అజ్ఞానమయము తికమకలునై యున్నది. ఇట్టి జగద్విషయమై శ్రమపడి క్షోభనందక అంతస్స్థిత పురుషుని భగవానుని ఎఱుంగుట, ఆతని దివ్యప్రజ్ఞ కలిగి యుండుట, ఆ అంతస్స్థిత ప్రజ్ఞయందే స్థిరపడియుండుట, ఇదియే మనకర్తవ్యము. ఏలనన,

బాహ్యజగత్తు మాఅజాలదు. అది నిరంతరము తన నైజస్థితి యగు నిశ్చేతనమందే, అజ్ఞానమునందే యుండును.

ఇక శ్రీ అరవిందుని భావము సూక్ష్మముగా నిది: జగత్తు, నేడున్నవిధమునుబట్టి, మొదట నిజముగా సంకల్పించినట్లు భగవానుని సృష్టిగా గాక, ఒక అప్రకాశము, అభాస, వికారము యొక్క వెలువరింతగా నున్నది. ఇది భగవచ్చైతన్యముయొక్క- భగవదిచ్ఛ యొక్క వెలువరింత ఆవిష్కారము గాదు. కాని అట్లు భగవదిచ్ఛానుసారము కావలయుననియే దాని యుద్దేశ్యము. ఈ జగత్తు, భగవానుని సమస్త సుస్వరూపములతో సర్వలక్షణములతో, అనగా ఆ దివ్యతేజము, దివ్యజ్ఞానము, దివ్యశక్తి, దివ్య ప్రేమ, దివ్య సౌందర్యములతో లోపరహితము సంపూర్ణము నైన భగవదావిష్కారములోని పరిణామాభివృద్ధి గాంచుటకే సృష్టింపబడినది.

పైని సూచించిన ప్రథమ ద్వితీయ భావములు రెండును తత్త్వజ్ఞలోకమునకు సుపరిచతములైనవే. అందువలన నిట శ్రీ అరవిందులు సూచించు తృతీయ దృక్పథమునుగుఱించియే కొంత వివరించ బ్రయత్నింతుము. మాయావాదము పరిపూర్ణసత్యము కాదనియు

సాధనావస్థయందు ఖండానుభవమువలన గనుగొనిన యొక ఖండ సత్యమనియు, మాయ యొక యనుభూతి యనియు, శ్రీ శంకరులకు సాధనావస్థలో, నప్పటి యాధ్యాత్మిక పరిణామదశలో, నొకప్పుడు స్ఫుటముగా గోచరించిన ముఖ్యానుభూతి యగుటచేత వారట్లు దానిని గట్టిగా నొక్కి చెప్పిరనియు శ్రీ అరవిందుల భావమై యున్నది.

ఈ మాయావాద మహాత్మ్యముననే అధ్యాత్మ చింతనాబలముగల ప్రతిభాశాలురు, అహముచు జయించి నిర్మమత్వబుద్ధితో సర్వము త్యజించిన మహానుభావు లెందఱో సన్యాసముస్వీకరించి ప్రపంచమును బహిష్క రించిరి. ఇందువలన మానవాభ్యుదయమునకే సర్వవిధ ముల నష్టదాయక మైనది. జడమని వ్యవహరింపబడు భౌతకమునందును భగవచ్ఛక్తి ఆ చైతన్యము గలదు. భగవ దంశలేని దెచ్చటను ఉండజాలదు. కాని యది నిమగ్నమై బాహ్యమునకు గోచరించుటలేదు. సర్వత్ర భౌతికమునకు నాధ్యాత్మికమునకును గల సన్నిహిత - అవినాభావసంబంధమును దాని యంతరములను వికాస మును వెల్లడించుటయందే శ్రీఅరవింద విధానమందలి విశేషము. ప్రపంచము వ్యర్థముగా సృష్టింపబడలేదు.

ఇది నిమగ్న చైతన్యావస్థలో నుండి సర్వత్ర దివ్య చైతన్యమును క్రమక్రమముగా నావిష్కరింపజేయుటకు వలయు నాధ్యాత్మిక పరిణామరంగమై యున్నది. ఈ పరిణామ ప్రక్రియలయందు పరమాత్మ చైతన్య విముక్తియొక్క ప్రథమసోపానము ప్రాణము. ద్వితీయ సోపానము మనస్సు. కాని పరిణామము మనస్సుతోడనే సంపూర్తికాజాలదు. ఆ పరిణామము ఒక మహత్తర స్థితిగా ఆధ్యాత్మికమును విజ్ఞానమయము నగు చైతన్యముగా బహిర్గతమగుటకు నిరీక్షించుచున్నది. చైత్య పురుషునియందు ప్రబలశక్తిగా విజ్ఞానాత్మల వికసనము పరిణామమందలి తదనంతరసోపానమై యుండవలయును. అపుడే యీ విశ్వపదార్థములందు నిక్షిప్తమైయుండు ఈశ్వరతత్త్వము సంపూర్ణముగా స్వయం విమోచనము నందును. ప్రాణశక్తి కపుడే తన పూర్ణత్వమును బ్రదర్శింప సాధ్యమగుచున్నది.

పరిణామ క్రమ మందు మనోభూమిక నుండి యావిర్భవించిన మనస్సు నేడత్యంత యుచ్చస్థితి యందున్నదని దానిమూలముననే ఆధునిక భౌతిక జ్ఞానము మిన్నుముట్టి కని విని యెఱుంగని యద్భుతముల నొనరించుచున్నదని మనము విస్మయ మందుచున్నాము. కాని

మనస్సు ఒకానొక స్థితికే పోగలదు. తదనంతరము తా నున్నరీతిలో ముందుకు పోజాలక యందే చక్రాకార ముగా మాత్రమే పరిభ్రమించుచుండును. ప రి మి తి మీద విభాగము మీద మన స్సాధారపడియున్నది. అది యేదో యొక నిర్దిష్టస్థానమునుండిమాత్రమే అపరార్థ స్థితియందు వ్యవహరించగలదు.

మనస్సునం దెన్నియో యంతరములు భూమికలు గలవు. శుద్ధ మనస్సు (Pure - mind), ఉన్నతతర మనస్సు (Higher-mind) తేజోమయ మనస్సు (Illumined-mind) స్వతఃస్ఫురణ మనస్సు (Intuitive-mind) అని ఇట్లు కొన్నింటిని ఏదోయొకవిధయుగా పాశ్చాత్యలోకమును నేడు గ్రహించినది. ఇంకను ఊర్ధ్వ భూమికలపైనున్న అతీతమనస్సు (Over-mind) ను మన పూర్వఋషులు గుర్తించియున్నారు. ఇది అపరార్థమున, పైన, చివర మెట్టుగా నున్నది. ఇట పరిపూర్ణము నవిసంవాదము నగు విజ్ఞానసత్యము భాగములుగా విభాగమై ప్రవేశించు చున్నది. పూర్వ హైందవ సంప్రదాయము అతీతమనో భూమికకు, విజ్ఞాన భూమికకు (Supramental Plane) గల అంతరములను గుర్తించినట్లు లేదు. అందువలననే

అతీతమనఃస్థితికి సంబంధించిన పాక్షికశక్తివలన, సృష్టికారకముగాని అసంపూర్ణ దశవలన, సంపూర్ణ సత్యము కుంటువడి తికమకలపాలై, ఆ స్థితియే మాయ యని అదియే పరమోత్కృష్టమైన క్రియాశక్తి యని అంగీకృతమై పరివర్తనరహస్యమును గోల్పోయినది. ఈ అతీత మనోభూమిక (Overmental Plane) కావల మహర్లోకమున, పరార్థమునందు, సచ్చిదానందములకు సన్నిహితసంబంధమైన విజ్ఞానభూమికలో విజ్ఞానము (Supermind) ఒండు కలదనియు, అది యా విజ్ఞాన భూమికనుండి యావిర్భవింప ప్రయత్నించుచున్నదనియు, ఆ విజ్ఞానము సదా సత్యచైతన్యమయముగా నుండు నని యు, ఆ విజ్ఞానమున కధిరోహించి యట దానిని వ్యష్టిగా ననుభవించుటగాక ఆ విజ్ఞానశక్తిని ఇట క్రింది కవరో హింప జేసి భౌతికమున స్థాపించుటవలననే అంతఃస్థితి యందు, అపరార్థమందు, అపరాప్రకృతికి బద్ధమైయున్న మనఃప్రాణశరీరములు పరిశుద్ధములై పరివర్తనమంది దివ్యోపకరణములై దివ్యజీవనము సాధ్యము గాగల దనియు, నపుడే ఈ ప్రపంచ ప్రహేళిక (Riddle of this world) ,సాధింపబడి అమృతత్వము నిత్యానందము ననుభవించుచు స్వారాజ్య సామ్రాజ్య సంపన్నులము

గాగలమనియు శ్రీ అరవిందులు సిద్ధానుభవులై చాటుచున్నాము.

తొల్లింటి వేదఋషులుగూడ నీ విజ్ఞాన (Supermind) శక్తిని చూచాయగా సమీపించి దర్శించి వ్యష్టిగా బ్రహ్మానందము ననుభవించుటయే లక్ష్యముగా బెట్టుకొనిన ట్లున్నదిగాని ఆ దివ్యశక్తిని భూచైతన్యమున కవరోహింపజేసి ఇట ప్రతిష్ఠించుటకు ప్రయత్నించియుండి నట్లును గనబడదు. మఱియు నీ విజ్ఞానమునకు సాంకేతిక మగు సూర్యమండలమును భేదించి సత్యలోకవర్తనులగు వారు శరీరముతో నిట తిరిగివచ్చుట అసాధ్యమనియే సూచించు ఉపనిషద్వాక్యములును గూడ కలవని తెలియుచున్నది. పరార్థమందలి ఈ పరమవిజ్ఞానమును కనుగొనుటయే గాక ఆ విజ్ఞానశక్తివలననే సశరీరముగా నీ భూలోకమందు దివ్యజీవనము ననుభవించుచు పరమేశ్వరుని దివ్యలీలలకు పాత్రులమై యుండవలయునే గాని ప్రపంచమును పరిత్యజింపరాదని నిరూపించుట, అందుకువలయు సమగ్ర సాధనవిధానమును సహేతుకముగ వెల్లడించుట, ప్రాచ్యపాశ్చాత్యఖండముల ప్రబలి యుండిన సమస్తదర్శనముల పరిశోధించి వానివాని యథార్థతత్త్వ మిదియని నిర్ణయించి వానిని సంయోజన

మొనర్చుట—వీనియందే శ్రీ అరవిందుల ప్రత్యేకత, ప్రతిభ గలదు. శ్రీ అరవిందులు రచించిన భాగవత జీవనము (The Life Divine) వేదరహస్యము (Secret of the Veda) ఈశోపనిషద్వ్యాఖ్యానము మున్నగు గ్రంథముల పఠించిన మన మీ తత్త్వవిచారమును మానసికముగా గొంత గ్రహించగలము.

మఱియు శ్రీ అరవిందు లిట్లు కృత్స్నదృష్టితో తత్త్వవిచారము నొనర్చుటవలన సృష్టియన నేమో, సృష్టికర్తగా నారాధింపబడు బ్రహ్మమునకుగల తత్సంబంధ మేమో, సూక్ష్మముగానేని చూచాయగానేని గ్రహించగలిగిన యెడల ననేక సమస్యలు పరిష్కృతములు కాగలవు; ప్రపంచప్రహేళికయే యుండజాలదు, లేదా దానిని సులభముగా విడదీయనగును. బ్రహ్మమో భగవానుడో ఏకముగా ననుభవించు తన నైజమైన సచ్చిదానందము ననేకముగా ననుభవింప నభిలషించెను. 'ఏకో హం బహుస్యాం.'

కేవలమ్ (Absolute), తత్ (That), బ్రహ్మ మను శబ్దముల అనిర్దేశ్యము నొక విధముగా ప్రధానాధ్యాత్మిక నిర్దేశ్యముగా వెల్లడించుటయే విడివడని త్రికము, సచ్చిదానందము. ఆ బ్రహ్మమో దైవమో పరమాత్మమో

నిరంతర మనంతముగా నున్నదని అనంత చేతనానంద సహితముగాగూడ నున్నదని యొకవిధముగా నిర్వచన మొనరించినట్లు భావింపనగును.

ఏకము నవిభాజ్యము ననంతము నగు సచ్చిదానందమునుండి గాక పరార్ధములో నాల్గవదిగా నెన్నబడు మహస్సు, మహర్లోకము, సర్జనకారియగు విజ్ఞానము లన బడు ఆ కక్ష్యనుండియే వి భా గ ము క్రమక్రమముగా ప్రారంభమై ప్రపంచసృష్టి యేర్పడినది. అందువలననే ఈ మహర్లోకము–లేదా విజ్ఞానమయ లోకము లేక కక్ష్య –(Supramental Plane) సచ్చిదానందమునకు శిశువని, అవరమునకు సంబంధించిన త్రిలోకములకు తండ్రియని పేర్కొనబడెను. ఈ విజ్ఞానమునే (Supermind) 'సత్యం–ఋతమ్–బృహత్' అని వేదఋషులు వచియించియుండిరి.

ఈ విజ్ఞానము, సచ్చిదానంద జనితమగుటవలననే తత్స్వభావముననుసరించి ఈ ప్రథమ ప రి ణా మ ద శ లో విభజన లేక ఏకముగా సర్వవ్యాపిగా ననంతముగానున్నది. 'బహుస్యాం' అను యభిలాష ఫలించవలసి యున్నది గాన ఈ విజ్ఞానమున పరిణామదశాద్వయ మేర్పడినది. మొదటిదానియందు విజ్ఞాన పురుషుడు, కవివలె, సాధన–సాధ్యము–సాధకుడు అంతయు నొకటే యైనట్లు తన యం

దున్న అనంతశక్తుల నొక్కొకటిగా నావిష్కారమొనరించి వానితో క్రీడింప నారంభించెను. బహుత్వ మింకను ప్రారంభముగాలేదు. ద్వితీయదశా పరిణామమందు క్రమ క్రమముగా తానావిష్కరించుకొని క్రీడించ నారంభించిన శక్తులివలన నాకర్షింపబడి, లేక వానిచేత వశీకృతుడై, వానితో విజ్ఞాన పురుషుడు, భగవానుడు, తాదాత్మ్య మందెను. అపుడే జీవు లనంతముగా నావిష్కృత మాయెను. 'బహుస్యాం' అభిలాష ఫలించినది. కాని ఇం దింకను రూపాదు లేర్పడలేదు.

కాని 'ఇదిగో అనేకముగా నున్నా' నని రూపా దులతో భగవానుడు తన్ను దానావిష్కరించుకొనినగాని 'బహుస్యాం' అను తన యభిలాష యథార్థముగా సార్థకముగాదు. తదర్థముగా, తన్నావిష్కరించుకొను ప్రక్రియలుగా మహర్లోక — స్వర్లోకముల మధ్య అంతర్దశా పరిణామము లేర్పడినవి. అవియే అతీత మనస్సు, స్వతఃస్ఫురణమనస్సు, తేజోమయమనస్సు, ఉన్నతతరమనస్సు అను అంతర్దశాభేద చతుష్టయము. ఉన్నతతర మనస్సునుండియే, అనగా మన కలవడిన మనస్సు నధిగమించినపుడే జ్ఞానసిద్ధి. ఇదంతయు పరార్ధమునుగురించి.

ఇక పరాపరార్థములు నిజముగా నన్యోన్య సంబంధములేని 'రెండా లేక ఒకే దానియొక్క ఛాయయా వికారమా' యను నదే మన మిపు డెఱుంగవలసినది. 'ఊర్ధ్వమూలం అధశ్శాఖ' యని వేదఋషులు పరమ సత్యమును బ్రత్యక్షముగా జూచి వచించియున్నారు. ఆ పరార్థమందలి 'సత్' శరీరముగా జడముగాను (Matter), 'చిత్' ప్రక్రియలలో నొకటైనదే ప్రాణము గాను, 'ఆనందమే' చైత్యాత్మగాను 'విజ్ఞానమే' మనస్సు గాను ఆవిష్కారమైన దిచ్చట అపరార్థమున. అనేకము గావలయునను కోరిక పరిపూర్తియగుటకే పృథక్ స్వభావముగల మనస్సునుండి ప్రాణము, ప్రాణమునుండి క్రమముగా పంచభూతములు నుద్భవించినవి. అనగా సూక్ష్మాతి సూక్ష్మమైన 'సత్' ఇచ్చట స్థూలమైన జడము (Matter) గానైనది. ఈ జడ మనబడు దానియందుగూడ నంతర్నిహితిగా సర్వకోశములు సోపానములును గలవు. అందుననే 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అని ఋషులు చాటి యున్నారు. ఇది అవరోహణ ప్రక్రియ. ఇక నారోహణ మును గుఱించి సూక్ష్మముగా నొకమాట. 'అంధకార మయమై అంధకారావృతమైయున్న' దని ఋషులు వర్ణించిన దశనుండి జడము, పృథ్వి ఆవిష్కారమై

క్రమక్రమముగా ప్రాణ మనోభూమికలు ఆరోహణము లైనవి. అజ్ఞానమగు మనోభూమికయే కడపటిదిగాదని, విజ్ఞానలోకము, అందలివిజ్ఞానము మఱొకండున్నదని మనకు తెలియును. ఆ విజ్ఞానభూమికగూడ మనఃప్రాణ శరీరముల వలె నిచ్చట పృథ్వీచేతన యందావిష్కరించుట తప్పని సరియైయున్నది. అట్లని మనస్సు ఆ విష్కృత మైన మాత్రమున ప్రాణశరీరము లంతరించనట్లు, విజ్ఞాన మా విష్కృతమైన తరువాత మన స్సంతరించదు. అది మఱెంత విశుద్ధము ప్రతిభావంతమునై విజ్ఞానమునకు వాహినిగా నుండును. అపుడే అజ్ఞాన రహితమైన దివ్యజీవనము! ఇంతకు పరాపరములు వేఱుగావని అపరమున నున్న ప్రతి భూమికకు పరమే ఆధారమని, లేదా దానిఛాయయే యని తేలుచున్నది. ఇక 'బ్రహ్మ సత్యం' 'జగన్మిథ్య' యనుట ఎట్లు పొసగును ? 'బ్రహ్మసత్య' మనుటతోబాటు తద్భి హ్మామే అయిన జగత్తును సత్యమనుట నంగీకరించవలసి యున్నది !

ఇక (శ్రీ) అరవింద యోగమును గుఱించి: అనుష్ఠాన ప్రధానమగు యోగమును వట్టిమాటలతో వర్ణించుట అంత ప్రయోజనకారి గాదు, సాధ్యమును గాదు. పూర్వ యోగములకు వీరి యోగమునకు ఆదర్శ

విధానములందు భేదము గలదు. ఇంతకు యోగ మనగా నేమి? మన యం దెన్నో శక్తులు గుప్తముగా ముకుళితములై యున్నవి. వానిని వికసింపజేసి తన్మూలమున బరిపూర్తి నిబడసి మనయం దిప్పు డవ్యక్తముగా నున్నటువంటి సకలాతీతము, సర్వగతము నగు దానితో, అనగా దివ్యసత్తతో, నైక్యమందుట కొకానొక ప్రక్రియ, నియత మార్గము, సాధన; ఇదియే యోగము. ప్రకృతిమాత తనజీవకోటిని జననమరణముల ద్వారా క్రమోన్నతికి గొంపోయి తరింపజేయుటయు యోగమే; ఇది పరిణామ ప్రక్రియ ననుసరించినదనిన, మానవు డీ జన్మముననే శీఘ్రకాలములోనే భగవత్సాక్షాత్కారము నందుట కొనర్చు యోగము విప్లవప్రక్రియ ననుసరించుచున్నదని చెప్పవచ్చును. హఠయోగ రాజయోగాదుల వలె ఏ కాయశుద్ధియో మనశ్శుద్ధియో ప్రధానముగా భావింపక సమస్తయోగముల ప్రధాన ప్రయోజన మందిమిడియున్నదని మనః ప్రాణశరీరముల సంపూర్ణ వికాసమును దివ్యత్వమును లక్ష్యముగా నుంచుకొనియున్నదని కాబోలు శ్రీవారి యోగము పూర్ణయోగమని వ్యవహరింపబడుచున్నది. కొందఱు సర్వయోగముల సంకలనము సంయోజనము నిందున్నదని యోగసంకలనమనియు యోగసం

యోజనమనియు నామకరణ మొనర్చియున్నారు. పూర్ణ
యోగ మనగా జ్ఞాన - భక్తి - కర్మమార్గములలో నొక్కొ
క్కమార్గముననే భగవానుని బడయుటకు బదులు,
(౧) పై త్రివిధమార్గములను అనేక ఇతరమార్గములను
ఐక్యమొనరించి మన సకల సత్త, సమస్త చేతనలయొక్క
శక్తులతో సకలాంశములతో దివ్యచేతనను, దివ్యశక్తిని,
దివ్యతేజస్సును, దివ్యానందమును సకల చేతనలో,
సత్తలో బడయుటయు, (౨) అంతఃస్థితముగా నాత్మలో
దివ్యోపలబ్ధిని గాంచుట మాత్రమేగాక, సమస్తప్రకృతిలో
గూడ బొందుట — అనగా మన యీ అవరమానుష్యక
మును దివ్యరూపముగా ఆధ్యాత్మికముగా పరివర్తన
మందించుటయు, (3) జన్మరాహిత్యమూలమున జీవితాం
తమున మాత్రమేగాక జీవితమున నిపుడు, అనగా జీవి
తమే దివ్యోపలబ్ధిని బడయునట్లు, దివ్యప్రకృతి ఆవిష్కార
మగునట్లు భగవానుని ఆవిష్కరింప జేసికొనుటయు. ఈ
పూర్ణయోగమున బడయు ముక్తియు నొక్కవ్యక్తిని
ఉద్దేశించినది మాత్రమేగాదు. వ్యక్తియొక్క ముక్తి
సిద్ధు లితరులయందును విస్తరిల్లును. అట్లు వ్యాపించుట
లోనే దీన్నిసార్థకత. ఇట్లు సమగ్రముగా గలుగు సిద్ధిమూల
మున వ్యాపించెడు ఆధ్యాత్మికజీవితము జాతి వ్యక్తుల

భౌతికజీవనమును భాగవతజీవితమున కుపకరించునట్లు భగవత్పరమొనరించి సాయపడును. ఇదియేయందలిమహా త్తమవిశేషము. ఇంతకన్న కాంక్షించగల దేమున్నది?

కేవల మజ్ఞాన భూయిష్ఠమైన ఈ భౌతికప్రజ్ఞనుండి దివ్యప్రజ్ఞ కధిరోహించుటమాత్రమే కాక ఆ దివ్యప్రజ్ఞ యొక్క పరమవిజ్ఞానశక్తి (Supermind) ని అజ్ఞానయుత మగు మనఃప్రాణశరీరములోనికి అవరోహింపజేసి వానిని పరివర్తనమొనరించి ఇచ్చట భగవానుని ఆవిష్క రింపజేయుట, ఈభౌతికమున దివ్యజీవనమును సృష్టించుట, సంపూర్ణముగా తన్నుదా భగవంతుని కొఱకునికే సమ ర్పించుకొనుట, ఆభగవచ్ఛక్తితో నైక్యమై తన్మూలమున ఆపరమవిజ్ఞానమయుడైన భగవానుని విశ్వాతీతమైన ఆ సమస్తతేజమును, శక్తిని, విశాలతను, శాంతిని శుద్ధిని చైతన్యమును మనలోనికి తీసికొనివచ్చుట—ఇదియే ఈ యోగలక్ష్యమని శ్రీ అరవిందులు వెల్లడించియున్నారు. మఱియు తమయోగము భగవానునికొఱకే గాని మాన వుని స్వోపయోగమునకు కాదనియు, మనము కాంక్షిం చునది మనస్వకీయావిష్కారము, పరిమితులనుండి బంధ ములనుండి విముక్తమైన వ్యక్త్యహంకారముయొక్క ఆవిష్కారము **గాక** భగవదావిష్కారమే అనియు,

ఆ భగవదావిష్కారమునందు మన సొంత ఆధ్యాత్మిక ముక్తి, భుక్తి, శుద్ధి, సిద్ధి, ఇవి యొకఫలము అంశము మాత్రమే అనియు, ఆ మన ముక్తి, శుద్ధిసిద్ధులుగూడ మనకొఱకనగా మన ఇష్టమువచ్చినట్లుపయోగించుకొనుటకు గాక భగవానునికొఱకు భగవత్ ప్రీత్యర్థమయ్యే అనియు శ్రీఅరవిందులు స్పష్టముగా సెలవిచ్చియున్నారు.

మానవుని దివ్యునిగా, మర్త్యుని అమర్త్యునిగా జేయుటయే శ్రీఅరవిందులి యాదర్శమని చెప్పనొప్పును. ఈ యాదర్శమెన్నడో రూపుదాల్చు నవకాశమున్నదని సంభవనీయమని సూచించుటతో మాత్రమే తృప్తి పడక, అది అవశ్యంభావి, అనివార్యము నని శ్రీఅరవిందులు నిరూపించుచున్నారు. జడ–చేతన మను రెండు చివరలకు మధ్యలంకెగానున్న మనఃప్రాణములే గాక అవరతమము కడపటిదియునగు జడముగూడ దివ్యచేతన గాగలదనియే శ్రీ అరవిందుల సిద్ధాంతము. వాస్తవముగ, జడచేతనములు మన మనుకొనునట్లు భిన్నములు కావు. జడములో చేతన అంతర్నిహితిగా నున్నది. చేతనయే క్రిందికవరోహించి స్వయముగా సంక్షిప్తము ఘనమునై యణగిపోవుట మూలముననే జడరూప మేర్పడినది. ఇట్లు తిరోహితమై జడమునందు గుప్తమగు

టయే అవరోహణ మని పేర్కొననగును. ఇట్లే జడము నుండి ప్రాణాదులద్వారా పై కుద్గమించుట ఆరోహణ మనబడును. ఈ యారోహణా వరోహణముల తీరు నిట్లు అరవిందులు వ్యక్తమొనర్చియున్నారు.

సత్ లేక సత్త (**Existence**) భౌతికము లేక జడము (**Matter**)
చిత్ లేక చిచ్ఛక్తి (**Consciousness-Force**) ప్రాణము (**Life**)
ఆనందము (**Bliss**) ఆత్మ లేక చైత్యుడు (**Psyche**)
విజ్ఞానము (**Supermind**) మనస్సు (**Mind**)

ఇందారోహ ణావరోహణములు రెండును గలవు. కేవల సత్తనుండి భగవానుడు చిదానందములద్వారా, ఆవల సర్జనశక్తిమూలమైన విజ్ఞానము (Supermind) ద్వారా అవరార్థమునకు సంబంధించిన సమస్తసత్త లోనికి, అనగా ప్రపంచసత్తలోనికి అవరోహణ మొనర్చు చున్నాడు. ఈ పరార్థాపరార్థముల ముడి, విజ్ఞానము మనస్సు రెంటి మధ్య నొక యావరణము నుంచుకొని మిళిత మగు స్థానము. ఈ మధ్యనున్న ఆవరణము జగజ్జననీ కరుణాకటాక్షముననే అనావృత మగును. ఇట్లనా వృతమై మానవజాతి దివ్యజాతిగా పరివర్తనమందుటయే శ్రీ అరవిందయోగముయొక్క పరమార్థము.

శ్రీ అరవింద తత్త్వే మందే ప్రప్రథమమున

మానవుడు, ఆతని ఐహికజీవనము పరిపూర్ణముగా సార్థక మైనట్లు పరిగణింపబడెను. ఐహికమున, ఈ భౌతిక శరీర మున మానవుడు సంపూర్ణ దివ్యత్వమును బడయగలడని చాటుటకు శ్రీఅరవిందులే ప్రథములు. దివ్యత్వమనగా, తన మనఃప్రాణ శరీరములను బోగొట్టుకొనుటవలన మాత్రమే మానవుడు పొందునదిగాదనియు, ఈ భౌతిక ప్రపంచములో శరీరధారియై నివసించుచు తనతోడి మానవులతో సంబంధబాంధవ్యముల నుంచుకొనుచు నాతడు దివ్యమానవుడుగా నగుట సాధ్యమనియు, సాధ్య మేగాదు - ఎప్పుడోగాక ఇపుడే - శీఘ్రముగనే దివ్యమా నవు డగుట తప్పని సరియనియు శ్రీ అరవిందు లనుభవ పూర్వకముగా సశాస్త్రీయముగా వెల్లడించుచున్నారు. ఇందే తొల్లింటి సకలసమయాచార్యుల తత్త్వములకు శ్రీ అరవింద తత్త్వమునకు గల ముఖ్యభేదము. ప్రాచీన మహాపురుషులందఱును మనఃప్రాణశరీరములతోటి సకల బంధములను భేదించుకొనిపోవుటలోనే మానవునిముక్తి యాధారపడి యున్నదని విశ్వసించిరి. ఆముక్తియైనను వ్యక్తిగతము మాత్రమే, మానవప్రకృతి మారదు. మానవుడు దివ్యుడుకాజాలడు, భౌతిక ప్రాణిక మానసిక మైన సకలప్రపంచము నుద్ధృతము గాదు. క్రియాయుత

మైన - తీవ్రప్రవృత్తిగల - దివ్యసత్య మొండుగలదని అది నేటి అజ్ఞానప్రపంచమున కవరోహించి నూతనచేతనను దివ్యజీవితమును సృజించగలదని శ్రీఅరవిందులు సిద్ధాంత మొనర్చుటలోగూడ మఱియొక ముఖ్య భేదము గనపడుచున్నది. పూర్వయోగములు తిన్నగా మనస్సునుండి కేవలబ్రహ్మమునకు బోయి ప్రకృతిస్థితియంతయు నజ్ఞానమని, భ్రమ, లేదా లీలయని భావించినవి. కూటస్థము నవిచలము నగు దివ్యసత్యమును ప్రవేశించినపుడు విశ్వసత్త పలాయనమగునట్లు వారు వచించియున్నారు. శ్రీవారి యోగముయొక్క మాహాత్మ్యమును అందలి యపూర్వవిశేషములను,మా వట్టిమాటలతో వర్ణించుట కన్న శ్రీవారి వాక్యముల నట్లే యుల్లేఖించుట ముఖ్యమని పది పండ్రెండేండ్లనాడు ప్రకటితమైన శ్రీవారి యొక యుత్తరములోని కొంత భాగము నిట ననువదించి యుదాహరించుచున్నాము.

అన్ని యంశములందును నా యోగము కేవలము క్రొంగ్రొత్తయని నే నెన్నడు నుడువలేదు. దానికి పూర్ణయోగమని నామకరణ మొనర్చితిని. అట్లొనర్చుటలో నే పురాతన యోగములసారమును, వానినుండి యనేకపద్ధతులను అది గ్రహించినట్లు తెలియగలదు; దాని నవీనత్వము, దాని లక్ష్యమందును, దానిని గుఱించిన దృక్పథ

మందును, ఆ పద్ధతియొక్క సమగ్రతయందును గలదు. 'కడిల్' 'లైట్సు' లోనగు గ్రంథములందుగాని ప్రకటింపనున్న నూతన గ్రంథమునందుగాని యోగముయొక్క ప్రారంభదశలనుమాత్రమే నేను వివరించియున్నాను. అంచా యోగముయొక్క విస్తృతిని సూచించు నాదర్శము, ఆ యోగవృత్తులందలి భావము, ఆ యోగము లక్షించు నంతిమవిశేషము, మఱియు నాత్మవిచారణ విధానము, దాని నిర్వహణము ఇవి తప్ప పూర్వయోగములనుండి ప్రత్యేకభేద మును జూపించున దేదియును లేదు. ఆ నవీనత్వవిషయము నీ యుత్తరములందు క్రమరీతిగా గాని ఏదోయొకపద్ధతి ననుసరించి గాని విపులీకరింపబడలేదు, సాధ్యమునుగాదు. అందువలన నింతకు ముందే బుద్ధిపరిచయమునగాని కొంత అనుష్ఠానమునగాని అలవాటు పడని వారావిషయమును గ్రహించలేరు. ఇంతవఱకు విడిలము ననాక్రాంతమునగు సీమను బ్రవేశించెడి యీ యోగముయొక్క యుత్తరోత్తరదశల విధానముంగాని, వివరముంగాని నేను బహిరంగపఱచలేదు, ప్రస్తుతమట్లొనర్ప నేనుద్దేశించను లేదు.

ఇదే మాదిరి పైకి కనబడు లక్ష్యములు, భావిసూచనలు— కొన్ని యోగమతముల ననుసరించి (మానవ) జాతియొక్క పూర్ణత్వము, కొన్ని తాంత్రికసాధనములు, సంపూర్ణకామసిద్ధి నందుటకు ప్రయత్నము మున్నగునవి— ఉన్నవని నాకుగూడ చక్కగా దెలియును. వీనినిగుఱించి నేనే పేర్కొనియున్నాను.

కేవలము ప్రపంచమున కావల దైవత్వసిద్ధిగాంచుటకు మాత్రమే గాక భూ(మి) చైతన్యము పరిణామధర్మానుసారముగా నింకను నిర్వహించవలసియున్న ఆ యుత్తరపథము నందుటకుగూడ జాతి యొక్క ఆధ్యాత్మికపూర్వదశ ప్రకృతి ప్రయత్నము గానుండి యున్నదను భావమునుగూడ నేను వెల్లడించియున్నాను. అందు వలన ఆయాదర్శములు నాదానితో సమాంతరములయ్యె నయ్యదియే గాకపోయినప్పటికిని నాయోగము, దాని లక్ష్యము, దానివిధానము, నూతనమని యంగీకరించినను అంగీకరించకున్నను నేనే మాత్రమును సరకుగొనను; అది యొక యల్పవిషయము. కాని దాని నంగీకరించగలవారుగాని దాని ననుష్ఠించగలవారుకాని ఆ విషయము సత్యమని గుర్తించుట, అదియే కార్యసిద్ధివలన సత్యముగా స్పష్టపడుట, ఇది యొక్కటియే ముఖ్యవిషయము; నవీనమనిగాని విస్మృతమైన పురాతనయోగమునే తిరిగి వర్ణించుట యని లేక పున రుద్ధరించుట యనిగాని ఎట్లు పేర్కొనినను ప్రమాద మేమియు లేదు. నాదృష్టియందు పూర్వయోగముల లక్ష్యమును భావమును తిరిగి యట్లే చర్వితచర్వణ మొనర్చుట తృప్తికరముగా నుండ లేదనియు స్వభావసిద్ధమై గతకాలపు సమస్తాధ్యాత్మిక ప్రయత్నము యొక్క నిగూఢఫలితమైయున్నప్పటికిని ఇంతవఱకు సిద్ధింపని దానిని ఇంతవఱకు దృగ్గోచరము కానిదానిని సాధించుట కొక విషయము నుపపాదించుచున్నాననియు తెలియజెప్పుటకు కొందఱు సాధకుల కొకయుత్తరమందు అది నవీనమని నొక్కి చెప్పియుంటిని.

క్రింద పేర్కొను ఈ కారణములవలన పురాతనయోగము లతో బోల్చిచూచినపు డిది క్రొత్తదిగా నున్నది:—

౧. ఈ యోగము ప్రపంచమునుండి జీవితమునుండి స్వర్గమునకో నిర్వాణమునకో పలాయన మగుటగాక జీవితముయొక్క ఉనికియొక్క మార్పునే కాంక్షించుచున్నది. ఆ మార్పు ఏదో యప్రధానము ప్రాసంగికముగాక విలక్షణము ముఖ్యోద్దేశ్యమునై యున్నది. ఇతరయోగములందవరోహణ మున్నను అది మార్గమందొక ప్రాసంగికముగా ముందుగా ననుకొనని యొక సంభవముగా నారోహణముయొక్క ఫలముగామాత్రమయియున్నది; నిజముగా నారోహణమే ముఖ్యము. ఇచ్చట ఈ యోగమందు ఆరోహణము ప్రథమసోపానమే, అది యవరోహణమునకు మార్గమే. ఆరోహణమున లభించు నవ్యప్రజ్ఞయొక్క యవరోహణమే ఈ సాధనయొక్క ప్రత్యేకధర్మము, విశిష్టలక్షణము. తాంత్రిక వైష్ణవ సాధనలుగూడ జీవితమునుండి విమోచనము గాంచుటయందే యంతమగుచున్నవి. జీవితముయొక్క దివ్యత్వపరిపూర్తియే ఇందు లక్ష్యముగా నున్నది.

౨. వ్యక్తికొఱకీశ్వరసాక్షాత్కారమునొక వ్యక్తిసాధించుటగా దీ యోగమున గాంక్షించు లక్ష్యము. ఏదో విశ్వాతీతమైనసిద్ధికి గాక ఇచ్చట, ఈ విశ్వమందు, భౌమికచైతన్యమునకు లభింపజేయుటకే. సాధించవలసిన విషయముగూడ నింతవఱకాధ్యాత్మిక జీవితమందు సహితము నిర్మాణముకానట్టియు భూలోకమున - పృథ్వీస్వభావమందు - ప్రత్యక్షముగా క్రియారూపముదాల్చనట్టియు నొక చైతన్యశక్తిని - విజ్ఞానశక్తిని - తీసికొనివచ్చుటయే. దాని నింకను నిర్మాణమొనర్చి ప్రత్యక్షముగా బనిచేయునట్లు చేయవలసియున్నది.

౩. తన ముందిడుకొనిన లక్ష్యమువలె సమగ్రము సర్వతో ముఖమునైన ఈ కార్యసిద్ధికి యొకవిధానము సృష్టీకరింపబడినది; అనగా ప్రజ్ఞయొక్క, స్వభావముయొక్క సంపూర్ణమైన సమగ్రమైనమార్పు. పురాతన పద్ధతులను గ్రహించినను, అవి ప్రత్యేకమైన వేఱుమార్గములకు కొంతపాక్షిక ప్రయోజనముగా తాత్కాలికసాహాయ్యముగా మాత్ర ముండును. పురాతనయోగములలో నీమార్గము నట్లే పూర్ణముగాగాని దానితోబాటుగా గాని వ్యవహరించినట్లు లేక స్వానుభవమునకు దెచ్చినట్లు నేను జూచియుండలేదు. నా కది లభించియుండి యున్నచో ముందుగా నంధకారము నుండి కాంతిమంతముగావించి, సిద్ధపఱచి, దిద్దితీర్చి, ప్రతిష్ఠించి, నిరపాయముగా ప్రకాశము - బహిరంగము - గా గావింపబడినటువంటి ఆమార్గముల ననుసరించి నే నతిత్వరితగతి సుఖముగా నాగమ్యస్థానమునకు పరుగిడగలిగియుండినపుడు తిరిగి నేను బాటల నిర్మించుటయందు * ముప్పది సంవత్సరములుగా తదన్వేషణమందు, అంతస్సృష్టియందు నా కాలమును వ్యర్థపుచ్చియుండరాదు.

పై నుదాహృతమైన లేఖనుండి, శ్రీ అరవిందు లెంత మృదువుగా నున్నితముగా సూచించినను, శ్రీవారి యోగ మన్నివిధముల నవీనమనియే నూత్నపరిణామ

---

* ౧౯౩౫ లో శ్రీవారు వ్రాసినది.

శయనియే స్పష్టమగుచున్నది. 'ఆర్య' లోని 'యోగ సంయోజన' మను వ్యాసపరంపరలను, ముఖ్యముగా 'ఆత్మసిద్ధియోగ' మను భాగములోని అధ్యాయములను పఠించినయెడల శ్రీ అరవింద యోగమందలి నవీనత్వము, కనివినియెఱుంగని పరివర్తనా ప్రక్రియలు ఋజువగును. ఆ విషయమును మాత్ర మతిసంక్షేపముగా సూచింప బ్రయత్నింతుము. దివ్యజీవనము దేవజాతి భూలోక మందిచ్చట స్థిరముగా నెలకొనవలయునన్న మున్ముందు మానవునియందు గల సకలాంశములు, కేంద్రములు విశుద్ధములై దివ్యోపకరణములుగా, ఈశ్వరావిష్కారమునకు వాహినులుగా నుండవలయును.

అందువలన మానవునందు ప్రధానమైన ఉపకరణ చతుష్టయ మగు శరీరము, ప్రాణము, చిత్తము, బుద్ధి, విశుద్ధములు సమర్థములునై పరాప్రకృతికి శరణుజొచ్చి తదనుగ్రహమునకు బాత్రమైయుండవలయును. యంత్రప్రాయముగా, ఆసన ప్రాణాయామాదుల వలన గొంత పురోభివృద్ధిని శక్తిని గడించినను అపరార్ధమునకువలయు నర్హత లభించదు. ఉచ్ఛ్రియము నందుకొనగల కృత్స్న యోగమువలననే సిద్ధించును. అపుడే శరీరము తన నైజమైన అవరస్వభావమునుండి శుద్ధిముక్తులను బడసి

మహత్త్వము, బలము, లఘుత్వము, ధారణాసామర్థ్యము లను గడించగలదు. ప్రాణముగూడ, పూర్ణతను, ప్రసన్నతను, సమతను, భోగసామర్థ్యమును బొందగలదు. అట్లే చిత్తము సౌమ్యత్వమును, తేజస్సును, కల్యాణ శ్రద్ధను, ప్రేమసామర్థ్యమును, ఇక కడపటిది, మానవునియం దధికాధికముగా వికాసము నందినదియు నగు బుద్ధియు విశుద్ధతను, ప్రకాశతను, విచిత్రబోధను,సర్వజ్ఞాన సామర్థ్యమును, సంపాదించుకొనగలవు.

ఈ పరిణతిని బడసినపుడే విజ్ఞానశక్తి, పరాశక్తి, జగన్మాత ఈయుపకరణముల ననుగ్రహించి, వానిభారము వహించి, పరిశుద్ధ మొనరించి, యున్నత శిఖరముల నందించి పరివర్తన మొనరించగలదు. అపుడే ద్వంద్వములు నశించి సమత్వము స్థిరపడి సర్వత్ర బ్రహ్మమే యనుభూతి గాగలదు. త్రిగుణములు నవరములు నగు మనః ప్రాణ శరీరములందును బరివర్తనమేర్పడును. తమోగుణ ప్రధానమైన శరీరము పై బేర్కొనిన నాల్గు శక్తులతో బాటు శాంతి పరాశాంతి మయమగును. అట్లే రజోగుణ ప్రధాన మగు ప్రాణము శక్తిగా, సత్త్వగుణప్రధానమగు మనస్సు తేజస్సు, జ్యోతిర్మయముగా నేర్పడును. అనగా శివచిహ్నముగా పరాశాంతిమయమైన శరీరము, రుద్రుని

చిహ్నముగా శక్తిగానైన ప్రాణము, విష్ణుచిహ్నముగా తేజోమయమైన మనస్సు పరిణతము లగును. ఇచ్చటను 'ఊర్ధ్వమూలం అధశ్శాఖ' అను వేదఋషుల వాక్యమే సార్థక మగుచున్నది. అపుడే దివ్యమైన భాగవతజీవనము, దివ్యజాతి భూలోక మం దావిష్కరించగలదు.

ఇంకను శ్రీ అరవింద యోగమును, ఆయోగ సాధనవిధానమును సమగ్రముగా గ్రహించుటకు వారు రచించిన యోగసంయోజనము (The Syntheis of yoga), 'తల్లి' (The Mother), యోగదీపికలు (Lights on Yoga), యోగపునాదులు (Bases of yoga), మున్నగు గ్రంథముల బఠించనగును. కాని యోగము నందలు, ఎవ రంతట వారు వా రిష్టము ననుసరించి యభ్యసింప గలిగినంత సులభవిషయము గాదు. అపూర్వము మహత్తరము నగు శ్రీవారి పూర్ణయోగము మఱింత కష్టతమము.

ప్రథమమున దైవమే కావలయునను తీవ్రాకాంక్ష తదితరలముల నన్నింటిని బూర్తిగా పరిత్యజించుట ఉండవలయును. శ్రద్ధాభక్తులు తీవ్రోజ్జ్వలనముగా నుండెడి ఇచ్ఛావిశ్వాసములు నిరంతరముండవలయును. 'సమత్వం యోగఉచ్యతే' అను గీతోక్తి ననుసరించి సమత్వము నభ్యసించి సాధించవలయును. 'సర్వధర్మాన్ పరిత్యజ్య

మా మేకం శరణంవ్రజ' అను శ్రీ కృష్ణభగవానుని ఆదే శము నను ష్ఠానమునకు దెచ్చుకొనవలయును. మఱియు సద్గురుసాన్నిధ్యమును. వారి యనుగ్రహమును లభించ వలయును. 'గురు వనగా నొక యున్నతతర ఆత్మస్థితికి చైతన్యమునకు 'నారోహించినవారు. సాధారణముగా వారిని సాక్షాదీశ్వరావిర్భావముగా లేక ఈశ్వర ప్రతి నిధిగా భావించెదరు. వారు తమ యుపదేశములవలన, నంతకంటె నెక్కువగా తమ ప్రభావాదర్శములవలన మాత్రమే గాక స్వానుభవము నితరులకు సంక్రమింప జేయునట్టి యొకశక్తిమూలమునను సాయపడుచుందురు.'

కాని శ్రీ అరవిందులు స్థాపించనున్న దివ్య జీవన మును గాంక్షించువారు కల్యాణశ్రద్ధతో, అనగా గురువ ర్యులు చాటుచున్న ఆదర్శము, విజయవంతము కల్యాణ ప్రదము తప్పక నగు నను విశ్వాసోత్సాహములతో స్థిర సంకల్పముతో తదేకనిష్ఠతో గొంతమంది యేని ప్రపంచ మం దెల్లెడల, ముఖ్యముగా భారతభూమి యం దుండవలయును. అట్టి ఆకాంక్ష, సంకల్పములు తీవ్రమగు కొలదియే ఈశ్వరానుగ్రహము లభించి దివ్యజీవన మేర్పడ వలయును. ఇది ముఖ్యవిషయము. అందువల్లన శ్రీ అరవింద వాఙ్మయమును బఠించి ఆ యాకాంక్షనుబడసి,

ఆ భావములను తోడిసోదరుల హృదయమందు నాటి ఈశ్వరోపాసకులగు వారు యథాశక్తి బ్రయత్నించి ధన్యులగుదురుగాక యని ఆశించుచు శ్రీ అరవింద పాదారవిందములకు భక్తిమెయి ప్రణమిల్లి ఇంతటితో విరమించుచున్నాము.

సంపూర్ణము

# ఆగస్టు పదునైదవ తేది, ౧౯౪౭.

ఆగస్టు తే ౧౫ ది స్వాతంత్ర్య ఇండియా జన్మదినము. అది ఇండియాకు పురాతన శకాంతమును నూతన యుగారంభమును సూచించుచున్నది. అది మనకు మాత్రమేగాక ఆశియాకు, సమస్త ప్రపంచమునకు నొక సాంకేతము. ఏలన, చెప్పనలవి గాని సాధ్యతలతో నొక నూతన ప్రభుత్వము సకలజాతుల కూటమందు ప్రవేశించుటను సూచించుచున్నది. ఆ ప్రభుత్వము మానవ కోటియొక్క రాజకీయ, సాంఘిక, వైజ్ఞానిక, ఆధ్యాత్మిక భవిష్యత్తును నిర్వహించుటలో విశేషపాత్రను వహించగలదు. ఈ దినము నా జన్మదినమై నేను ప్రతిపాదించిన జీవితసిద్ధాంతమును స్వీకరించువారు ప్రతిసంవత్సర ముత్సవ మొనర్చుచుండుటచే నాకు వ్యక్తిగతముగా నది ఈ మహత్తరసాంకేతమును బడయుట సహజముగ సంతోషదాయకము గాగలదు. గుప్తవేత్తనైన నే నది కాకతాళన్యాయమని గాని ఆకస్మిక సంఘటనమని గాని గాక దైవశక్తియొక్క యనుమతి తదంగీకారముద్ర యని గ్రహించుచున్నాను. న న్నాదివ్యశక్తియే, ఏకార్యముతో నాజీవిత మారంభమైనదో ఆ కార్యమం దడుగడుగన నడిపించుచున్నది. నిజస్థితిలో నించుమించు ప్రపంచోద్యమములన్నియు, నా జీవితకాలములో సిద్ధించునట్లు చూడవలయునని ఆశించిన ఆకాలములో, నవి యసాధ్యము

లగు స్వప్నములుగా గనపడినను, ఫలసిద్ధికి సమీపముగానున్నట్లో, లేదా ప్రారంభమైనట్లో, నెఱవేరుమార్గమున నున్నట్లో ఈ దినమున నేను గుర్తించగలుగుచున్నాను.

ఈ యుత్కృష్టసమయమున సందేశ మొసంగుమని యడిగినారుకాని ఆ ట్లొసంగుస్థితిలో లేను. ఏ ఆదర్శముల, ఉద్దేశ్యముల నా బాల్య యౌవనములలో నేనూహించి, ఇపు డవి ఫలప్రదము లగుట కారంభించుటను చూచుచున్నానో వానిని గుఱించి స్వకీయము వ్యక్తిగతము నగు ప్రకటనము నొనర్చుట మాత్రమే నేను చేయగలిగిన దంతయును. ఏలనన నవి ఇండియా స్వాతంత్ర్యమునకు సంబంధించినవి; ఇండియా భావికార్య మని నేను విశ్వసించెడిదానిలోని భాగము; అది ప్రధానస్థానమును గైకొనక తప్పనిసరియై యున్నదిగనుకను. ఎందువలన ననగా తన భౌతిక స్వప్రయోజనములను, తన విస్తృతిని, ఔన్నత్యమును, శక్తిసంపత్తులనుమాత్రమే నెఱవేర్చుకొనుటకుగాక — వానినిగూడ ఇండియా విస్మరించగూడ దప్పటికిని — నిశ్చయముగా నితరులవలె అన్యదేశీయులపై నేలుబడిని సంపాదించుటకుగాక, సమస్త మానవజాతికి మార్గదర్శిగా సాహాయ్యకారిగా, భగవానునికొఱకు ప్రపంచముకొఱకుగూడ ఇండియా జీవించుచున్నదని, ఉద్బోధమగుచున్నదని చెప్పియున్నాను; నన్నెపుడును ఆ భావమే అంటియున్నది. ఆ యుద్దేశాదర్శముల సహజక్రమము లివి:

ఇండియా స్వాతంత్ర్యైక్యముల సాధించు విప్లవము; మానవ సభ్యతాభివృద్ధిలో తాను వహించియుండిన ఉచ్చపాత్రను మరల గైకొనుట, ఆశియాపునరుద్ధానము, స్వాతంత్ర్యమును; మానవకోటి

కొక నవీనము, మహత్తరము, ప్రకాశమానము, సౌదార్యము నగు జీవనమున కధిగమించుట. ఆ జీవన సంపూర్ణ సంసిద్ధి జాతీయ జీవనమును సమకూర్చి కాపాడుచు, బాహ్యమున ప్రజల ప్రత్యేక యునికియొక్క సర్వము నధిగమించి, ఐక్యమును బొందుపఱచుచు, అంతర్జాత్యైక్యముమీద నాధారపడును. సమస్తజాతికి ఆధ్యాత్మిక జీవనమునకు వలయు తన విధానములను, తన అధ్యాత్మికజ్ఞానమును ఇండియా ప్రసాదించుట; కడపటిది, ఉన్నతతర భూమికకు చేతన నధిగమించుటవలన మానవు డుద్బోధితుడై, వ్యష్టి సమష్టి సిద్ధులనుగూర్చి కలలగాంచ నారంభించినప్పటినుండి వానిని కలవర పఱచినట్టియు, విసిగించినట్టియు జీవితసమస్య లనేకముల పరిష్క రింపగల నూత్న పరిణామపథము.

ఇండియా స్వతంత్రము, కాని యైక్యమును బడయలేదు, చిట్లిన భిన్నమైన స్వాతంత్ర్యమే లభించినది. బ్రిటీషు వారు జయించుటకు పూర్వము విభిన్నసంస్థానములుగా నుండిన అయోమయస్థితిలో మరల పడిపోవునాయను నట్లొకప్పుడు కనిపించెను. అదృష్టమువలన అట్టి ప్రమాదమైన పతన స్థితినుండి తప్పించుకొన గల దృఢమైన సంభవత ఇపుడు వర్ధిల్లినది. చట్టనిర్మాణసభవారు తెలివితేటలతో నవలంబించిన తీవ్రపద్ధతి ఛిద్రము, చీలిక లేకుండ నిమ్నజాతుల సమస్యాపరిష్కారమును సాధ్యమొనర్చినది. కాని హిందూ ముస్లీముల ప్రాచీన కులవిభజనము దేశముయొక్క రాచకీయస్థిర విభజనగా గడుసుబారినట్లు కన్పించుచున్నది. ఈ నిర్ణీత విషయమెప్పటికి స్థిరపడినదని గాని, ఏదో తాత్కాలిక పరిష్కారముకన్న మించిన దని గాని దేశీయమహాసభ జాతియు నంగీక

రించదని ఆశించెదము. విభజన శాశ్వతమైనయెడల ఇండియా తీవ్రముగా దుర్బలమై పోవచ్చును; కుంటువడిగూడపోవచ్చును; అంతర్యుద్ధమునకు చిరవకాశ మేర్పడగలదు. విదేశీయుల పునర్దండయాత్ర, విజిగీషగూడ సంభవములు. దేశవిభజన మంతరించవలసినదే — అది నేటి తీవ్రోద్రేకము సడలిపోవుటవలన, శాంతియన్యోన్యతల ఆవశ్యకతను క్రమక్రమముగా గ్రహించుటవలన, అందఱకు సంబంధించి కలిసిమెలసి చేయగల నిరంతర కార్యావసరమువలన, అందు నిమిత్తమై ఏర్పడగల ఐక్యోపకరణములవలన సిద్ధించగలదని ఆశించెదము. ఈ విధముగా నైక్య మేరూపముననేని లభించవచ్చును. సరియైనరూపము మూలసిద్ధాంతముగా గాక వ్యావహారికముగా ప్రధాన్యముగావచ్చును. కాని యే యుపాయముననేని విభజన మంతరించవలెను, అంతరించును. ఐక్యము లేకున్న ఇండియా భవితవ్యము తీవ్రముగా క్షీణించును; విఫలముగూడ గావచ్చును. కాని యట్లు కాగూడదు.

ఆశియా మేల్కొనినది; అందలి బహుభాగములు విముక్తములైనవి; లేదా ఈ క్షణమందే విముక్తము లగుచున్నవి; దాస్యమందున్న ఇతరభాగములు స్వాతంత్ర్యమునకై పోరాడుచున్నవి. ఏ స్వల్పమో చేయవలసియున్నది, అది నేడో రేపో చేయబడును. ఆ విషయమున ఇండియా తనపాత్ర నిర్వహించవలసియున్నది; అపుడే తన సాధ్యతల పరిమాణమును సూచించగలిగినట్టియు సకల జాతుల సంఘమునందు తన కుండగలస్థానమును జూపెట్టగలిగినట్టియు శక్తిసామర్థ్యములతో తనపాత్ర నిర్వహణము నారంభించినది. మానవైక్యము మార్గమున బడినది; స్వశక్తి యసంపూ

ర్ణముగానే యున్నను, వ్యవస్థితమైయున్నది; కాని ప్రబలకష్టముల నెదుర్కొని పోరాడుచున్నది. బలముగలదు; చరిత్రానుభవమును మార్గదర్శిగా గైకొంటిమేని అది జయించువఱకు తప్పనిసరిగా నభివృద్ధి నందవలసినదే. ఇందుగూడ ఇండియా తన ప్రధానపాత్రను నిర్వహింప నారంభించినది; తాత్కాలిక విషయములకు, సమీపములోనే సంభవమగువానికి బద్ధముగాక భవిష్యత్తు వీక్షించి దానిని మఱింత సామీప్యమునకు తీసికొనిరాగల ఆ రాజనీతిచతురతను బెంపొందించగలదేని, తనయునికి మందము - భయాన్వితము, ధైర్యము - వేగవంతము వీని తారతమ్యములవలె పురోభివృద్ధి నొనర్చునగును. ఏదో మహా ఆపత్తు మధ్యలో దాపరించి నిరోధించవచ్చును, జరుగుదానిని నాశనము గావించవచ్చును; అప్పటికిని ఫలము నిర్దిష్టము. ఏలనన, ఏరీతిగానేని ఐక్యము ప్రకృతివిధానమం దావశ్యకమైనది; స్వతస్సిద్ధమైనది; దాని సంసిద్ధిని దృఢముగా ముందే చెప్పవచ్చును. జాతులకుగూడ దాని యావశ్యకత విస్పష్టమైనది; అదిలేకున్న స్వల్పజనసంఖ్యాకులగు జాతులస్వాతంత్ర్య మిక నెన్నడు సురక్షితము కాజాలదు; మహత్తరము శక్తిమంతము నగు జాతులుగూడ నిరపాయముగానుండజాలవనుట నిశ్చయము. ఇండియా విభాజ్యమయ్యేయుండునెడల తన రక్షణముగూడ కల్లయగును. అందువలననే అందఱి క్షేమార్థమే ఐక్యమేర్పడవలయును. మానవుని బుద్ధిమాంద్యము విమూఢమైన స్వార్థపరత్వము మాత్రమే దానిని నిరోధించగలవు. వానికి వ్యతిరేకముగా దేవతలు ప్రయత్నించినను గూడ నిష్ప్రయోజనమని వచింపబడియున్నది; కాని ప్రకృతియొక్క యావశ్య

కతకు భగవదేచ్ఛకు వ్యతిరేకముగా కలకాల మది నిలువజాలదు. అపుడు జాతీయత సార్థకమగును; అంతర్జాతీయభావము, దృష్టి పెంపొందవలయును, అంతర్జాతీయరూపములు సంస్థలు నెలకొన వలయును; ద్వంద్వము బహుళను నగు పౌరసత్వాభివృద్ధిగూడ నుండవచ్చును; ఈ ప్రక్రియలో సభ్యతల స్వేచ్ఛాసంయోగము గూడ గలుగవచ్చును. జాతీయభావము దృక్పథము తన తీవ్రతను విడనాడి తనస్వీయదృష్టియొక్క సంపూర్ణతను సమగ్రముగా సమన్వయించునట్లు కనుగొనవచ్చును. నవీనమైన ఏకత్వభావము మానవజాతి నావరించును.

ప్రపంచమున కిండియాయొక్క ఆధ్యాత్మిక ప్రసాదాను గ్రహ మపుడే ప్రారంభమైనది. ఇండియా యొక్క యాధ్యాత్మికత యూరోపమెరికాలందు నిరంతర మధికాధికపరిమాణమున ప్రవేశించుచున్నది. ఆ యుద్యమ మభివృద్ధియగును; కాలాను గుణమగు విపత్తులమధ్యగూడ నధికాధికదృక్కు లాశతో ఇండియా వంక తిరుగుచున్నారు; కేవ లోపదేశములకే గాక దాని చైత్యాధ్యాత్మికసాధనకు నధికాధికముగా నాశ్రయించుచున్నారు.

మిగత దంతయు నా వ్యక్తిగతమైన ఆశ, భావము, ఆదర్శము. ఇవిగూడ నిండియాలోను పాశ్చాత్యదేశములోను, రెండింటియందును, దూరదృష్టిగలమేధావులను వశీకృతము గావింప నారంభించినవి. ఇతరోద్యమములందుకంటె ఈ పథమందు కష్టములు మఱింత దుర్ఘటము; కష్టములు, వానిని జయించుటకే, ఏర్పాటుపబడినవి; మఱియు పరమపురుషుని ఇచ్ఛయున్నయెడల నవి నిశ్చయముగా నతిక్రమింపబడును. ఇందును, ఈ పరిణామ

మేర్పడవలయు నేని, — ఆత్మోన్నతి, అంతర్ చేతనాభివృద్ధి వీని మూలముననే రావలయునుగాన, — ప్రారంభ మిండియానుండియే జరుగగలదు. ఆ యవకాశము విశ్వమునకంతకు నున్నను కేంద్రోద్యమ మిండియాదేగావచ్చును.

ఇండియా స్వాతంత్ర్య దినమునుగురించి నా భావమిది. ఎంతవఱకు సంబంధమున్నది, ఎంతవఱకు, ఎంత త్వరగా నెఱవేర గలది అనునవి ఈ నూత్నము స్వ తం త్ర ము న గు ఇండియాపై నాధారపడును.

౧౫ ఆగస్టు ౧౯౪౭ శ్రీ అరవిందులు

